కొత్తపల్లి పిల్లల కథల పుస్తకం-56 డిసెంబరు2012

**మూలం: http://kottapalli.in/2012/12/welcome**

**మొత్తం ప్రతుల సంఖ్య:** 2000

**సంపాదకులు:** నారాయణ

**ముఖచిత్రం 'క్రిస్మస్‌తాతవస్తున్నాడు':** వీరాంజనేయులు

**అక్షర కూర్పు:** *కొత్తపల్లి*

**వెల: రూ.20/-**

ఇంటర్నెట్‌లో ఈ పుస్తకాన్ని వివిధ ఫార్మాటుల్లో ఉచితంగా చదవవచ్చు, డౌన్లోడు చేసుకోవచ్చు, అవసరమనిపిస్తే మీ వాణిజ్యేతర కార్యక్రమాలకోసం మీ అంతట మీరే దీన్ని ముద్రించుకోవచ్చు!



కొత్తపల్లి ప్రచురణలు

యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి- 515 101, అనంతపురం జిల్లా.

ఫోను: 08559 240222, 7702877670 ఇ-మెయిలు: team@kottapalli.in




# విషయ సూచిక

# క్రిస్మస్ వచ్చింది!

అమ్మ ఏదైనా పని చెప్పిందనుకో, మనకేమో బద్ధకం-"ఆ పని చేస్తే ఏం వొస్తుంది?" అని ఊరికే కూర్చుంటాం. అప్పుడేమౌతుంది? ఒకటి, పని అవ్వదు. రెండు, మనకి ఆ పని చేసిన అనుభవంరాదు: అంటే ఆ పని నుండి మనం దేన్నో నేర్చుకోగలమే- అది నేర్చుకోలేం. ఇంక మూడోది, ఆపని చేసేటప్పుడు ఇంకో పని ఏదో మొదలవ్వొచ్చు చూడు, అది మొదలవ్వదు.

పని చేస్తే ఏం వొస్తుంది? 'పని నుండి పని మొదలవుతుంది'- ఆ ఒక్క కారణమూ చాలు, పని చేసేందుకు.

దానికి ఉదాహరణ, 'నికొలస్' కథ.

చాలా కాలం క్రితం 'నికొలస్' అనే పిల్లవాడు ఊళ్ళో అందరికీ బాగా సాయం చేస్తూ ఉండేవాడట. పేదవాళ్లందరినీ పిలిచి, తన వాటా రొట్టెల్ని వాళ్లతో పంచుకొని తింటూ ఉండేవాడట. 'అట్లాంటి మంచి పిల్లవాడిని ఏం చెయ్యాలి?' అని ఆలోచించి, వాళ్ల అమ్మవాళ్ళు వాడిని చర్చిలో చేర్పించారు- 'కొంచెం భక్తి, కొంచెం శాస్త్రాలు, అన్నీ నేర్చుకుంటాడులే' అని.

నికోలస్ అన్నీ నేర్చుకున్నాడు. దాంతోపాటు ఏమయింది? -వాడి మంచితనం కూడా పెరిగింది. కష్టాల్లో ఉన్నవాళ్ళకు సాయం చేసే గుణం గట్టి పడింది. ఎవరు కనిపించినా వాళ్లకి సంతోషం కలిగేట్లు 'ఏవో చిన్న బహుమతులు ఇద్దాం' అనిపించసాగింది అతనికి.

'అరే, వీడు చిన్నవాడే, కానీ చాలా గట్టివాడు' అని చర్చివాళ్లు వాడికి పెద్ద ఉద్యోగం ఇచ్చారు. చిన్న వయసులోనే అతను కాస్తా 'బిషప్ నికొలస్' అయిపోయాడు. ఎర్ర అంగీ వేసుకొని, ఎర్ర కుచ్చు టోపీ పెట్టుకొని, గుర్రం మీద ఊరూరా తిరిగి, బిషప్ నికొలస్ కష్టాల్లో ఉన్నవాళ్లకు ఏవేవో సాయాలు అందిస్తూ వచ్చాడు. జేబులో చాక్లెట్లు, బిస్కెట్లు నింపుకొని, కనబడిన పిల్లాడికల్లా వాటిని

పంచుతూ వచ్చాడు. ఎక్కడికి వెళ్తే అక్కడ, పిల్లలు ఈ 'చిన్న బిషప్' చుట్టూ గుమిగూడేవాళ్ళు . అతను వాళ్లని ముద్దు చేసి, నవ్వి, నవ్వించి- సంతోషపెట్టేవాడు.

ఒక పని ఇంకో పనిని ఇస్తుంది- చిన్న నికొలస్ అలాగే బిషప్ నికొలస్ అయ్యాడు.

ఒకరోజున బిషప్ నికొలస్‌కి ఎవరో ఒక పేదవాడి గురించి చెప్పారు. ఆ పేదవాడికి ముగ్గురు కూతుళ్ళు. పేదరికం వల్ల అతను వాళ్లకు కడుపునిండా అన్నంకూడా పెట్టలేకుండా ఉన్నాడు. అందుకని, ఎవరు కొంటే వాళ్ళకు, వాళ్లని అమ్మేద్దామనుకుంటున్నాడట, అతను!

అది విని నికొలస్‌కి చాలా బాధ వేసింది. 'పిల్లల్ని అమ్ముకోవడం ఏంటి, నేను వీళ్లకు ఏమైనాసాయం చేస్తాను' అని, ఆరోజు రాత్రి అందరూ నిద్రపోతున్న సమయంలో- మెల్లగా- ఆ పేదవాడి గుడిసె మీదికి ఎక్కాడు నికొలస్... గుడిసె పై కప్పుకు ఓ పొగ గొట్టం ఉంది... నికొలస్ తను తీసుకొచ్చిన బంగారు నాణాల సంచీలు మూడింటిని, ఒకదాని వెనుక ఒకటిగా ఆ పొగగొట్టంలోంచి క్రిందికి వదిలేసి, చప్పుడు చెయ్యకుండా చూరుదిగి వెళ్లిపోయాడు.

అది చలికాలం. ఆ రోజుల్లో అక్కడి ఆడపిల్లలు సాక్సులు(మేజోళ్ళు) లేకుండా బయట తిరిగేవాళ్లు కాదు. మరి, ఈ పేదవాడి కూతుర్లు ముగ్గురికీ తలా ఒక్క జత మేజోళ్లే ఉన్నాయి. వాళ్ళు వాటిని రోజూ రాత్రిపూట ఉతుక్కునేవాళ్లు. ఉతికాక, 'ఉదయంలోగా ఆరాలి కదా' అని వాటిని పొయ్యి మీద వ్రేలాడదీసుకునేవాళ్ళు.

ఆరోజున కూడా వాళ్ళు అదే పని చేశారు: మేజోళ్ళని పొయ్యి మీద వ్రేలాడదీసుకున్నారు. అలా నికొలస్ వదిలిన బంగారపు మూటలు నేరుగా ఆ మేజోళ్లలో వచ్చి పడ్డాయి!

తెల్లవారగానే మేజోళ్లకోసం వచ్చిన పిల్లలు ముగ్గురికీ బంగారపు మూటలు దొరికాయి. వాళ్ల కష్టాలన్నీ తీరిపోయాయి. ఇంకేముంది, ఈ వార్త ఊరూరా ప్రాకింది. రాత్రి అవ్వగానే అందరూ తమ మేజోళ్ళను తెచ్చి పొయ్యి మీద వ్రేలాడదీసుకోవటం మొదలుపెట్టారు. "ఏదో మ్యాజిక్

జరుగుతుందట. మేజోళ్లలోకి ఏవేవో బహుమతులు వచ్చి పడతాయట!" అని అందరూ చెప్పుకోవటం మొదలు పెట్టారు.

ఇట్లా పిల్లలు ఆశ్చర్యపోవటం , ఆశ్చర్యపోవటం కోసం ఎదురుచూడటం- రెండూ బిషప్ నికొలస్‌కి చాలా నచ్చాయి. ఇక అప్పటినుండీ ఆయన రాత్రిపూట తిరగటం, పిల్లలకి తెలీకుండా ఆశ్చర్యం గొలిపేటట్లు బహుమతులిస్తుండటం మొదలు పెట్టేశాడు.

పని పనిని ఇస్తుంది, నిజంగానే. చూస్తూండగానే బిషప్ నికొలస్ పెద్దాయన అయిపోయాడు.



బిషప్ నికొలస్‌కి ఆ తర్వాత ఎంత పేరు వచ్చిందంటే, ఆయన్ని చర్చి వాళ్ళు 'సెయింట్ నికొలస్' (నికొలస్ మహాత్ముడు) అనేశారు. సంతోషానికి, ప్రేమ-ఆప్యాయతలకు మారు పేరు 'సంట్ కొలస్' అని దేశ దేశాల్లోనూ ప్రజలు చెప్పుకోవటం మొదలెట్టారు. అట్లా, చిన్న నికొలస్ కాస్తా మెల్లిగా సంట్‌కలస్ అయిపోయి, చివరికి 'సాంతాక్లస్' అయిపోయాడు!

క్రిస్మస్ రోజున పిల్లలందరికీ కోరుకున్న బహుమతులిచ్చి సంతోష పెట్టేది ఆ 'సాంతా'నే! అయితే ఇప్పుడు ఆయన ఇచ్చే బహుమతులకోసం పొయ్యిలమీద మేజోళ్ళుకూడా వ్రేలాడదీయనవసరం లేదు. పనుల్ని ఇష్టంగా చేస్తూపోతుంటే చాలు! పనిని వెతుక్కుంటూ పని - ఆ పనికి బహుమతిగా మరో పని- ఇట్లా వరసపెట్టి వస్తూనే ఉంటాయి.

ఇష్టంగా పనులు చేసేవాళ్ళు అందరికీ క్రిస్మస్ శుభాకాంక్షలు !



-కొత్తపల్లి బృందం.



# నీతిచంద్రిక

*జరిగిన కథ: హంసరాజ్యం మీదికి నెమలి దండెత్తి వస్తున్నది. గూఢ చర్యం కోసం ముందుగా కాకిని పంపింది. దూతగా చిలుకను పంపింది. ఇద్దరూ వచ్చి వాకిట్లో నిలబడి ఉన్నారు. మంత్రి ఎంత వద్దన్నా, యుద్ధంలో కాకి సాయం తీసుకోవాలనుకుంఉంది హంస. ఇక చదవండి, నీతిచందిక-? వభాగం.*

'సరే అయితే, ఇక సభకు పదండి ' అని హంస రాజు ఆనతి ఇవ్వటంతో చక్రవాక మంత్రి బయట సభాగృహానికి నడచి వెళ్లాడు. ఆలోగా హంసరాజు వేరే మార్గం ద్వారా సభా గృహంలోకి ప్రవేశించటం, తన ఆసనాన్ని అలంకరించటం, ఇతర మంత్రులందరూ నిలచి ఆయనకు నమస్కరించి తమ తమ స్థానాలలో కూర్చొనటం జరిగాయి.

చక్రవాకం కావలి వాడి నొకడిని పిలిచి, "నువ్వు ఆ చిలుకను, కాకిని వెంటనే ప్రభువుల వారి దగ్గరకు తీసుకొనిరా" అని చెప్పింది. అతను 'సరే, మహా ప్రసాదం' అని పోయి, చిలుకను, కాకిని, వెంట బెట్టుకొని సభా గృహంలోకి ప్రవేశించాడు.

హిరణ్య గర్భుడు తన చేతి సైగతో వారినిద్దరినీ తగిన ఆసనాలతో కూర్చోబెట్టి, యోగక్షేమాలు అడిగి, వాళ్లు ఎందుకు విచ్చేశారో చెప్పమన్నాడు. అప్పుడు ముందుగా చిలుక హంసకు ఎదురుగా నిలబడి, నిర్భయంగా ఇలా అన్నది - "ప్రభూ! నేను వచ్చిన సంగతిని తమకు స్పష్టంగా విన్నవించుకుంటాను. జంబూద్వీపానికి అధిపతి అయిన 'చిత్రవర్ణుడు' అనే నెమలిరాజు పంపిస్తే మీతో మీతో దూతగా మాట్లాడి పోదామని వచ్చాను. నేను చెప్పబోయే దాని స్థిర చిత్తంతో వినవలసినది. బాగా మనసుపెట్టి, ఏకాగ్ర చిత్తంతో మా రాజు చెప్పిన పలుకులను తమరు చెవిన వేసుకోండి- "మీ కర్పూర ద్వీపంతో సహా ఇక్కడున్న చిన్న చిన్న దీవులన్నీ మా జంబూద్వీపం క్రిందికే వస్తాయి. గనుక, మీరంతా యీర్ష్యా సూయలు మాని, మాకు పన్ను చెల్లించుకోవాల్సి ఉన్నది. అందువల్ల, మాన-ప్రాణాలపై ఏ మాత్రం ఆశ ఉన్నా, నువ్వు కూడా ఔను -కాదు అనే సంకోచం మాని, వెంటనే మా దేశానికి వచ్చి, మా పాదాలను శరణువేడి, యీ సంవత్సరం మొదలుకొని ప్రతి ఏడూ కప్పం చెల్లించు. ఇట్లా మెల్లగా చెబితే నీ మనస్సుకు అంగీకారం కుదరకపోతే, ఇదిగో - నేను వస్తున్నాను - యుద్ధంలో నీ మదాన్ని అణచివేసి, యీ భూమిని కాపాడేందుకు వేంచేస్తున్నాను. దమ్ముంటే ఎదురు నిలచి పోరాడు" -అని మీకు తెలియపరచి, మీ సమాధానం ఏమిటో కనుక్కొని రమ్మని నన్ను ఇక్కడికి పంపాడు. నేను ఇక్కడ ఎక్కువ సేపు ఉండేందుకు వీలు లేదు. వెంటనే సమాధానం ఇచ్చి నన్ను సాగనంపేది. మా నెమలి రాజు అసాధారణ బలశాలి. అంతులేని శత్రు సమూహాల గర్వాన్నైనా పాతాళానికి అణగద్రొక్క గల ధైర్య సాహసాలు ఆయన సొంతం. ఎవరినైనా శిక్షించాలన్నా, క్షమించాలన్నా ఆయనకే చెల్లుతుంది. కనుక నా మాట విని ఆ నెమలిరాజును శరణు వేడండి. ఆయన మాట వినకపోతే ఇక తమరికి నూకలు చెల్లినట్లే - తమరి కీర్తి క్షణంలో నశించిపోతుంది" అన్నది.

దాని మాటలు విని హంసరాజు తోక త్రొక్కిన త్రాచు మాదిరి చర్రున లేచి నిలబడ్డాడు. రోషంతో ఆతని పెదవులు అదిరాయి. అతని శరీరం అద్భుతంగా వన్నెలీనింది - మేఘం ఉరిమినట్లు ఉరుముతూ అతను "ఎట్టెట్టా! ఇవాళ్ల ఏవో క్రొత్త సంగతులు వింటున్నామే!" అంటూ సభ నలువైపులా కలియజూస్తూ "ఆహా! చూశారా, అందరూ?! ఇవాళ్ల ఎట్లాంటి వింతలు పుట్టుకొచ్చాయో! ఒక పనికిమాలిన నెమలి ఎక్కడో ఉన్నదట, దానికి రాజపక్షి అయిన హంస పాదాక్రాంతం కావాల్సి ఉన్నదట! ఔరా! ఏమి వింత మాటలు! అట్లా జరిగితే ఇక ప్రపంచంలోని సింహాలన్నీ శాశ్వతంగా కోతుల పాదసేవ చేసుకుంటూ తమ జీవితాల్ని పావనం చేసుకుంటాయి కాబోలు! తన శక్తి ఏపాటిదో తెలీక అజ్ఞానాంధకారం అలుముకోగా చిత్రవర్ణుడు అసాధ్యపు కోరికలు కోరుతున్నాడు. ఇంతకు ముందెన్నడో 'వాళ్లను-వీళ్లను గెలిచానుగా' అనుకొని, క్రొవ్వెక్కి, ఇక్కడా అట్లా కొద్దిలోనే పోతుందను కొని విర్రవీగుతున్నాడు గాని, 'హిరణ్యగర్భుని ప్రతాపం' అనే మంటకు తన ప్రాణాలను ఆహుతి చెయ్యాల్సి వస్తుందని కొంచెం కూడా ఆలోచిస్తున్నట్లు లేదు" అని అరిచాడు.



అట్లా కోపంతో కరకుగా మాట్లాడుతున్న రాజువైపుకు చూడలేక, ఆ సభలోని వారంతా భయావహులైపోయి ఒకరి ముఖాలొకరు చూసుకోవటం మొదలుపెట్టారు.

అంతలో ముఖంలోకి ఉత్తుత్తి కోపాన్ని తెచ్చుకొన్న కాకి- చిలుక ప్రక్కనే కూర్చొని ఉన్నది కాస్తా హంసరాజు మనోభావానికి తగినట్లు తటాలున లేచి నిలబడి, ఆ

చిలుకమీదికి దూకేందుకు సిద్ధమైనట్లు నటిస్తూ హంసరాజుతో సవినయంగా "మహారాజా! చావు దగ్గరపడి, యీ మూర్ఖుడు నిండు సభలో కన్నూమిన్నూ కాననట్లు, లేని చనువు తెచ్చుకొని, నోటికి వచ్చినట్లు మాట్లాడుతుంటే, వినలేక నా చెవులు బ్రద్దలౌతున్నాయి. వీడికి ఎన్ని గుండెలు లేకపోతే, ఇట్లాంటి దుష్టపు మాటలు వెలువరించే సాహసం చేస్తాడు?! ఇట్లాంటి వాడిని 'దూత' అని దయచూడకూడదు.



అధములలోకెల్లా అధముడైన వీడు ఖచ్చితంగా మరణశిక్షకు పాత్రుడు. నేను తమరి సేవకుడిని - ఇక్కడ నిలచి ఉండగా ఇక తమరికి వేరు శ్రమ లేదు. తమరిక మాట్లాడకండి - యీ తుంటరిని నేను ఇదిగో - క్షణాల్లో అంతమొందిస్తాను. నా యీ విన్నపాన్ని అంగీకరించి తమరు నాకు అనుజ్ఞ ఒక్కటీ ఇవ్వండి చాలు" అన్నది.

అట్లా కాకి కదిలి చిలుక మీదికి దూకబోగా, దానికి అడ్డు వస్తూ, చక్రవాక మంత్రి ఇట్లా అన్నది. "ఆగు, ఆగు - ముందు చూపులేని అవివేకపు పని కూడదు. ధర్మాన్ని బూడిదలో కలుపకు. దూతగా వచ్చిన వాడి ప్రాణాలు తీయటం సరైన పనికాదు. 'సరైన దానిని విడచిన రాజు దగ్గర సంపదే నిలువదు'అని ధర్మం తెలిసినపెద్దలు చెబుతుంటారు.

మనస్సు, మాట, పని - యీ మూడింటిలోనూ ప్రాణుల పట్ల ఏకొంచెం కూడా చెడు భావనా లేకుండా ఉండటాన్నే 'శీలం' అంటారు. సమస్తానికీ ఆధారం శీలమే. శీలం వల్లనే ధర్మం నిలబడుతుంది, ధర్మం వల్ల సత్యము, సత్యం వల్ల మంచి నడవడి కలుగుతాయి. మంచి నడవడిక వల్ల బలం

వస్తుంది. బలం వల్ల సంపద లభిస్తుంది. దానివల్ల కోరినవన్నీ లభిస్తాయి. 'ఆవు -ఆవు కొట్లాడి మధ్యలో లేగదూడ నడుము విరిచినట్లు, 'రాజు - రాజు పోట్లాడి నడుమున దూత ప్రాణాలకు ఎసరు పెడతారా? ఇట్లా చేస్తే అన్ని అనర్థాలూ సంభవిస్తాయి. దూత అన్నవాడు ఎప్పటికీ అవధ్యుడే (-చంపకూడని వాడే). అతడు 'తనని ఎవరూ చంపరు ' అన్న భావనతోనే కదా, తనకు చెప్పి పంపిన పలుకులను నోరుదాచుకోకుండా బయటికి చెప్పేది? అంతే తప్ప, తన తక్కువదనాన్ని ఇతరుల గొప్పదనాన్ని సొంతగా చెబుతాడా? ఇతని మాటలలో తప్పునెంచకు, దూత మాటలకు కోపం తెచ్చుకోవటాన్ని మించిన అవివేకం మరొకటి లేదు. మూర్ఖులకు కోపం ముక్కుమీదే ఉంటుందట. కోపం వచ్చిన వాడు 'ఏది చేయదగిన పని-ఏది చేయరాని పని' అన్న జ్ఞానం కోల్పోయి, చంపకూడని వాళ్లను కూడా చంపుతాడు; చివరికి తనకు తానే కష్టం కొని తెచ్చుకుంటాడు.

అన్ని పాపాలకూ ఆధారం కోపమే, అందుకనే కదా, పెద్దలు చెప్పేది- "బుద్ధిమంతుడు క్షమాజలాలతో కోపపు అగ్నిని ఆర్పాలి" అని?! క్షమా గుణమే అన్ని విధాలైన సమృద్ధికీ ఆధారం. కోపాన్ని మెచ్చుకొనటం సరైనది కాదు. క్రూరమైన పని వీరులకు తగినదెలా అవుతుంది?" అని మందలించింది.



ఆ విధంగా నీలవర్ణుడి ఆవేశాన్ని కొంచెం తగ్గించే సరికి అతడు గట్టిగా శ్వాసను వదిలి - కుండలోకి నొక్కిన పాము మాదిరి రోజుతూ నిలబడ్డాడు. తన మృదువచనాల వల్ల తేరుకొని, కోపాన్ని కొంత అదుపులోకి తెచ్చుకున్న హంసరాజుతో మంత్రి ఇలా అన్నది- (ఏమన్నదో మళ్ళీ చూద్దాం...)



# లేని దయ్యాలు

*రచన: కె. నాగలక్ష్మి, 9 వ తరగతి, అరవిందాహైస్కూల్, కుంచనపల్లి, గుంటూరుజిల్లా.*

హైదరాబాదులో డిగ్రీ చదువుతున్న నవ్య, సుమ ఇద్దరూ మంచి స్నేహితురాళ్ళు. ఇద్దరికీ పుస్తకాలంటే ఇష్టం; టి.వి.చూడటం అంటే చాలా ఇష్టం. వాళ్ళు చదివే పుస్తకాలు, చూసే టి.వి.కార్యక్రమాలు అన్నీ మామూలువి కావు- దయ్యాలవి.

నవ్యకి, సుమకి ఇద్దరికీ దయ్యాలంటే ఆసక్తి. దయ్యాల కథలు చదవడం అంటేనూ, దయ్యాల గురించి తెలుసుకోవడం అంటేనూ వాళ్లకి చాలా ఇష్టం. అట్లా విని విని కొత్తగా కథలు రాయడం కూడా నేర్చుకున్నారు వాళ్ళు. అట్లా ఎన్ని కథలు వ్రాస్తూన్నారంటే, చివరికి వాళ్ళ చదువును కూడా పట్టించుకోలేదు వాళ్ళు. ఇంటి నిండా అట్లాంటి పుస్తకాలే పెట్టుకున్నారు ఇద్దరూనూ. వాళ్ళ అమ్మానాన్నలు వాళ్ళకు చాలా రకాలుగా చెప్పి చూశారు- "తల్లీ! ఎందుకమ్మా, ఇంత పిచ్చి? కథలే రాయాలంటే మంచి మంచి విషయాలు ఎన్ని లేవు? ఎప్పుడూ దయ్యాలేనా?" అని. అయినా గాని వాళ్ళు వింటేగా?

ఎనిమిదో తరగతికి వచ్చేసరికి, ఇద్దరూ

హాస్టలులోఉండి చదువుకోవాల్సి వచ్చింది. హాస్టలులో ఇద్దరిదీ ఒకటే గది. ఇంకేముంది?- ఇద్దరూ తమ గదిని దయ్యాల కథలతో నింపేశారు.



ఒక రోజు రాత్రి నవ్య, సుమ నిద్రపోతున్నప్పుడు నవ్యకు ఒక దయ్యం కల వచ్చింది. మనకుండే ఆసక్తులే మన కలలకు ప్రేరణనిస్తుంటాయి కదా. మనం ఎప్పుడూ దయ్యాలగురించే ఆలోచిస్తూంటే మనకొచ్చే కలలు కూడా దయ్యాలవే వస్తుంటాయి. అట్లా నవ్యకు వచ్చిన ఆ కలలో- నవ్య, ఆమె భర్త ఇద్దరూ నిద్రపోతున్నారు. అంతలో ఒక దయ్యం సుమ వేషం వేసుకొని వచ్చి నవ్య భర్తను చంపేసింది. అప్పుడు లేచి చూసిన నవ్య దయ్యాన్ని గుర్తుపట్టి, తన చేతిలో ఉన్న చాకుతో దాన్ని పొడిచేసింది-

పెద్దగా అరుస్తూ నిద్రలేచింది నవ్య. ప్రక్కనే ఆపిల్ కోసుకునే కత్తి ఒకటి ఉంటే దాన్ని చేత పట్టుకున్నది. ఆ అరుపులకు నిద్రలేచింది సుమ- "ఏమైంది ఏమైంది?" అంటూ నవ్యను పట్టుకొని కుదిపింది. కానీ నవ్యకు అక్కడ సుమ కనిపిస్తేనేగా, ఆమె బదులు దయ్యమే కనబడుతున్నదాయె! దయ్యం తనను పట్టుకుంటున్నదన్న భ్రమలో స్నేహితురాలినే కత్తితో పొడిచేసింది నవ్య!

అందరూ పరుగున వచ్చి, సుమను ఆసుపత్రిలో చేర్పించారు. నవ్యను పోలీసులకు అప్పగించారు. ఆమె తన అమాయకత్వాన్ని నిరూపించుకునేసరికి తల ప్రాణం తోకకు వచ్చింది.

వెనక్కి వచ్చాక సుమ, నవ్య ఇద్దరూ క్రొత్త మనుష్యులయిపోయారు- ఇప్పుడు వాళ్ళ గదిలో ఒకటంటే ఒక్క దయ్యం కథ కూడా లేదు. గదిలోనే కాదు- వాళ్ల ఆలోచనల్లోనూ లేవు, దయ్యాలు! 



# పిడుదు రంగయ్య

*సేకరణ: వి.జ్యోతి, 5 వతరగతి, పులేటిపల్లి, అనంతపురం జిల్లా.*
*మార్పు చేర్పులు, పొడిగింపు: కొత్తపల్లి*

ఒక ఊరిలో రంగయ్య, శివమ్మ అనే భార్యాభర్తలు ఉండేవారు. వాళ్ళకు ఒక ఆవు ఉండేది. దాని పేరు లక్ష్మి. లక్ష్మిని వాళ్ళు చాలా ప్రేమగా చూసుకునేవాళ్ళు.

ఒక రోజు శివమ్మ చాలా రుచిగా ఉండే కూర చేసింది. అది తిని రంగయ్య "చాలా బాగుంది ఇది- రేపటికి కూడా దాచి పెట్టుకొంచెం" అన్నాడు. "సరే" అంది శివమ్మ. అక్కడే ఉన్న ఆవు శివమ్మ మాటలు విని గట్టిగా నవ్వింది.

రంగయ్య నిద్రపోయిన తరువాత శివమ్మ ఒక్కతే ఆవు దగ్గరికి వచ్చి "ఎందుకమ్మా లక్ష్మి, నేను ఏదో అంటే నువ్వు నవ్వావు?" అని అడిగింది. "రంగయ్యకు రేపు అనేది ఉండదు. ఈ రోజు రాత్రి అతడు మరణిస్తాడు" చెప్పింది

ఆవు. అది విని శివమ్మ బాధపడుతూ "ఏదైనా ఉపాయం చెప్పమ్మా, పుణ్యం కట్టుకో" అంది.

"సరే, ఇవాళ్ళ నీ భర్త కోసం యమదూతలు వస్తారు. వాళ్ళకు రుచికరమైన వంటలు చేసి పెట్టు. నువ్వు కోరిన వరం ఇస్తారు వాళ్ళు. అప్పుడు నువ్వు నీ భర్త ప్రాణాలు అడుగు" అన్నది ఆవు.

"సరే!" అంది శివమ్మ.

ఆరోజు రాత్రి శివమ్మ నిద్రపోకుండా మగనివైపే చూస్తూ కూర్చున్నది. ఆమె చూస్తూండగానే ఒక నాగుపాము వచ్చి రంగయ్యను కాటు వేయబోయింది. మెలకువగా ఉన్న శివమ్మ చటాలున ఒక బుట్టను పాము మీద పడేట్లు విసిరింది. అంతలోనే వాళ్ల ఇంటి దూలం ఒకటి విరిగి రంగయ్య మీద పడబోయింది. ఆమె చటాలున అతన్ని ప్రక్కకి లాగి కాపాడింది. చూస్తూండగానే వాళ్ల ఇంటికి మంటలు అంటుకున్నాయి. ఆ సరికి నిద్రలేచిన రంగయ్యను పట్టుకొని, రంగమ్మ బయటికి పరుగు పెట్టింది. ఆ సరికి ఊళ్ళోవాళ్ళు అందరూ అక్కడికి చేరుకున్నారు. అందరూ కలిసి నిప్పునార్పారు.

ఆ వెలుగులో దూరంగా నక్కి కూర్చున్న యమ భటులు కనబడ్డారు శివమ్మకు. ఆమె వాళ్ల దగ్గరికి వెళ్లగానే వాళ్ళు "ఇంతకే అయ్యిందనుకోకు-మేం వచ్చిన పని అయ్యేంతవరకూ మేం వెనక్కి వెళ్ళేది లేదు" అన్నారు. ఆమె వాళ్లతో మర్యాదగా మాట్లాడి "ఎట్లాగో వచ్చారు, ఆయన్ని తీసుకుపోతామంటున్నారు- అయినా దానికోసం నేనుండే ఇల్లు తగలబెట్టటం మీకు తగినపనేనా? ఇంక నేను బతుక్కునేది ఎలాగ?" అని అడిగింది. "సరే, ఏడవకు. నీ ఇంటిని మళ్ళీ మామూలుగా చేసేస్తున్నాం" అని వాళ్ళు ఇంటిని మళ్ళీ మామూలుగా చేసేశారు.

"బాగుంది- ఇంటికి వచ్చిన అతిథులు మీరు. మిమ్మల్ని వట్టి చేతులతో పంపితే ఇక నాకు ఎట్లా జరుగుతుంది? ఒక్క పది నిముషాలు ఆగండి. వేడి వేడిగా అలచంద వడలు వేసిస్తాను. తినిపోదురు" అన్నది శివమ్మ. అంతవరకూ ఊరికే నక్కి కూర్చుని

కష్టపడుతున్న యమభటులకు 'అలచంద వడలు' అనగానే నోరూరింది. శివమ్మ ఇంక వాళ్ల అంగీకారం కోసం ఎదురుచూడకుండా అప్పటికప్పుడు అలచందలు రుబ్బి, వేడి వేడి వడలు చేసి పెట్టింది వాళ్ల ముందు. అసలే యమభటులాయె, చాలా సేపటినుండి ఎదురు చూస్తూ కూడా ఉన్నారేమో, ఒక్కొక్కరూ ఇరవైఐదు వడలు లాగించేశారు వాళ్ళు.

అందరూ కడుపారా తిని, తృప్తిగా త్రేన్చాక, తినేందుకు ఆకు-వక్క కూడా తెచ్చిచ్చింది శివమ్మ. అవి కూడా పుచ్చుకొని, వాళ్ళు 'సరే మరి ఇంక రంగయ్యను తీసుకొని వెళ్ళొస్తాం' అని బయలుదేరారు.

శివమ్మకు ఇంకేం చెయ్యాలో అర్థం కాలేదు.

'అయ్యో, మీరు వచ్చింది పల్లెకా, పట్టణానికా? పల్లెకు వచ్చి కడుపునిండా కమ్మని పాలు త్రాగి వెళ్లకపోతే మా పాడి అంతా ఏం కాను?' అన్నది లక్ష్మి, శివమ్మకు మాటను అందిస్తూ.

'అవునవును- ఇంకో పది నిముషాల్లో పాలు పితికేస్తాను. చల్లగా కాసిని పాలు త్రాగి బయలు దేరుదురు' అన్నది శివమ్మ-నులకమంచాలను తెచ్చి వేసి, లక్ష్మిని పాకలో గుంజకి కట్టేస్తూ.

యమభటులు ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. కానీ బాగా తిని ఉన్నారేమో, వాళ్లకు కొంచెం ఆయాసంగానే ఉన్నది. నులకమంచాలు వాళ్లను చాలా ఆకర్షిస్తున్నాయి కూడా. చివరికి బద్ధకం గెల్చింది. వాళ్ళు విశ్రాంతిగా కూర్చున్నారు మంచాలమీద. ఇంకో రెండు నిముషాలలో వాళ్ళు గురకలు పెట్టి నిద్రపోతున్నారు!

శివమ్మ లక్ష్మి పాలు పితుకుతూ 'మరి ఇప్పుడు ఏం చేద్దాం లక్ష్మి, వీళ్ళు నిద్రలేచారంటే రంగయ్యని ఎత్తుకుపోతామని మళ్ళీ పాట మొదలుపెడతారు' అన్నది విచారంగా.

లక్ష్మి 'ఏం కాదులే శివమ్మా, ఇంకేదైనా అడ్డం వేద్దాంలే' అన్నది చిక్కని పాలు మరిన్ని ధారగా వదులుతూ.

పాలు బాగా కాగి, ఎర్రని మీగడ కట్టేసరికి మరో రెండు గంటలైంది. అంతలో యమభటులు

గబుక్కున లేచి కూర్చున్నారు- గుండెలమీద చెయ్యివేసుకొని "అయ్యా, వచ్చేస్తున్నాం అయ్యా, ఇంకేమీ ఆలస్యం చెయ్యం దొరా" అంటూ.

శివమ్మ చటుక్కున వేడి వేడి పాలు తీసుకొచ్చి వాళ్ల ముందు పెట్టింది.

"అయ్యో, పాలు చాలా వేడిగా ఉన్నాయమ్మా తల్లీ! అటు చూస్తే దొర పిలుస్తున్నాడు. మా కష్టం కూడా చూడు. అన్నపూర్ణమ్మ తల్లివి- మీ రంగయ్యని తీసుకెళ్తుంటే మాకూ బాధగానే ఉంది. కానీ ఏం చేయగలం, మీ ఇంట్లో ఉన్నది ఈ ఒక్క రంగయ్యే కదా? వేరే రంగయ్య ఎవరూలేరు కదా, మేమేం చెయ్యాలి చెప్పు?!" అన్నాడొక యమభటుడు, వేడి వేడి పాలని ఊదుకొని జుర్రుకుంటూ.

"వేరే రంగయ్య లేకేమి? ఇదిగో, నా చెవి మీద కూర్చొని, నా రక్తం తాగి బలుస్తున్న పిడుదు- వాడు రంగయ్య కాదూ?" అన్నది లక్ష్మి, అతని మాటని అందుకొని.

"అవునా!? నిజంగానే ఈ పిడుదు పేరూ రంగయ్యేనా?" అన్నాడు యమభటుడు ఆవు చెవికేసి పరీక్షగా చూస్తూ.

"అయ్యో! ఈ మనిషి రంగయ్య ఎంత మంచివాడో మా పిడుదు రంగయ్య అంత దుర్మార్గం వాడు. మీరు ఈ ఇంట్లోంచి ఎవరినైనా తీసుకెళ్ళాల్సి వస్తే మొదట వాడినే తీసుకెళ్ళాలి- అసలు మీరు వచ్చిందీ పిడుదు రంగయ్య కోసమే అయి ఉంటుంది- సరిగ్గా కనుక్కోండి- తప్పు ప్రాణాన్ని తీసుకెళ్తారేమో, మీ దొర ఊరుకోడు" అంది ఆవు అమాయకంగా.

యమభటులు ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. "అవునురా, మనం తీసుకెళ్ళాల్సింది ఆ పిడుదు గాడినే- పదండి వాడిని తీసుకొని పోదాం. దొర ఏమీ అనడుగాని" అన్నాడు వాళ్లలో ఒకడు, శివమ్మ కేసి కృతజ్ఞతతో చూసి, అలచంద వడల్నీ, వేడి వేడి పాలనీ గుర్తుచేసుకుంటూ.

"తీసుకెళ్లండి పాపం, తప్పుడు ప్రాణాలు తీసుకెళ్తే మీకూ కష్టం" అంది శివమ్మ, "మీ దొర కాదంటే మళ్ళీ వద్దురు లెండి" అని జోడిస్తూ.

"మళ్ళీ రాం లేమ్మా, ఎవరోఒక రంగయ్య- ఈ ఇంట్లోంచి దొరికితే చాలు, మా దొర ఏమీ అనడు గానీ- చల్లగా ఉండు" అని యమభటులు పిడుదు ప్రాణాలు చేతబట్టుకొని మాయం అయిపోయారు.

"పిడుదు రంగయ్యకోసం ఊరందరికీ భోజనాలు పెట్టిద్దాం లక్ష్మి" అన్నది శివమ్మ , ఆవుని ఆప్యాయంగా నిమురుతూ.



**గురువుకు నామాలు!**

నవ్వండి!

టీచర్: కిరణ్, నువ్వెందుకు హోమ్‌వర్క్ చెయ్యలేదు?

కిరణ్: క్షమించండి, టీచర్.

టీచర్: "క్షమించండి" అనేమాట నా డిక్షనరీలో లేదు.

కిరణ్: లైబరీలోని డిక్షనరీలో తప్పకుండా ఉంటుంది టీచర్- చూసిపెట్టమంటారా?



# మొండి రాజు

*రచన: వేదయుక్తి, 8 వతరగతి, రిషివ్యాలీస్కూల్, మదనపల్లి, చిత్తూరుజిల్లా.*

అనగనగా ఓ రాజు ఉండేవాడు. అతను మొండివాడు, పెద్ద వెర్రివెంగళప్ప కూడా. ఒక రోజున, అతను గుర్రం పైన సవారీ చేస్తుండగా ఒక పెద్ద చెరువు అడ్డం వచ్చింది. మొండి రాజుకి కోపం వచ్చి,"చెరువూ! ప్రక్కకి జరుగు!" అని ఆజ్ఞాపించాడు. కానీ చెరువు ఒక్క అంగుళం కూడా ప్రక్కకు జరగలేదు.

"జరగమన్నానా!? ఎందుకు జరగవు? నా మాటనే కాదంటావా? ఎన్ని గుండెలు నీకు?! నేనెవరనుకుంటున్నావు?" అని మొండిరాజు రకరకాలుగా కళ్ళెర్రజేసి, ముఖం జేవురించుకొని చూశాడు. ఎంత సేపు తిడుతూ కూర్చున్నా చెరువు కదల్లేదు, మెదల్లేదు. చివరికి మొండి రాజుకు విసుగు పుట్టి, తటాలున వెనక్కి తిరిగి కోటకి వెళ్ళిపోయాడు.

కోట చేరిన వెంటనే అతను భటులను పిలిచి, "రేపు తెల్లవారేలోపుగా దక్షిణం వైపున ఉండే ఆ చెరువుని తూర్పు వైపుకి జరపండి. ఎందుకు జరగదో చూస్తాను- నేనెవరనుకుంటున్నది?" అని అరిచాడు.

"ఇదెక్కడి గొడవరా, బాబూ " అనుకొని భటులంతా పోయి చెరువు దగ్గర నిలబడి, "తల్లీ, ఇదెక్కడి కష్టం వచ్చిపడింది. నిన్ను ప్రక్కకి జరపాలట! ఎంత పనో మా రాజుకి ఏం తెలుసు? చేసేవాళ్లకి తెలుస్తుంది కష్టం" అని రకరకాలుగా బాధపడ్డారు.



కొంచెంసేపటికి చూస్తే ఆశ్చర్యం, ఆ చెరువు ప్రక్కకు జరిగిపోయింది! భటులందరికీ తల తిరిగినట్లయింది. వాళ్ళు చెరువుతల్లికి రకరకాలుగా మొక్కుకొని, "తల్లీ! నువ్వు మా మాట విన్నావు. నిజమైన దేవతవు తల్లీ, నిన్ను కాదనే మా రాజుకి కళ్ళు తెరిపించు చాలు" అని వెనక్కి పోయి, "పని చేసేశాం మహారాజా!" అని రాజుగారికి మనవి చేసుకున్నారు.

మొండి రాజుకి తన మాట నెగ్గించుకున్నందుకు చాలా సంతోషం వేసింది. హాయిగా గుర్రం పైన సవారీ చేస్తూ చెరువు గట్టు వెంబడి పోయాడు. అతను పోతూ ఉంటే, చెరువు అతని వెంబడి తిరగటం మొదలు పెట్టింది. అయితే మొండిరాజు, గమనించనేలేదు. చివరికి అతను అట్లా తిరుగుతూ తిరుగుతూ సాయంత్రానికల్లా అలసిపోయాడు, దారి తప్పాననుకున్నాడు. అతను ఎటు వెళ్ళినా, మరి, చెరువే అడ్డం వస్తున్నది!

మెల్లగా చీకటి పడింది. రాజుకి కోటని చేరే మార్గం దొరకలేదు. ఆకలేస్తున్నది. "ఎటో ఒకవైపుకు వెళ్దాం, ఏదోఒక ఊరు

దొరక్కపోదు" అని పోబోయాడు, కానీ ఇంకా దారి తప్పిపోయాడు. అలవాటు లేని ప్రాణం కదా, ఇంత సేపు ఏమీ తినకుండా ఉండేసరికి, ఆగలేకపోయాడు- "అవును, నేను చెరువు దగ్గర ఉన్నాను కదా, దాహం వేస్తున్నది, నీళ్లు త్రాగుతాను" అని చెరువు దగ్గరకి వెళ్ళి నీళ్లు త్రాగబోయాడు- కానీ చెరువు అతనినుండి దూరంగా వెళ్ళిపోయింది! మళ్ళీ ప్రయత్నించాడు, చెరువు మళ్ళీ దూరంగా జరిగింది! చివరికి జలదేవత ప్రత్యక్షమయింది చెరువు నీళ్ళలో- "నా నీళ్లని తాకే ధైర్యం ఎక్కడ నుండి వచ్చింది నీకు?" అని కోపంగా అన్నది- "ఈ రోజే కదా నన్ను దారిమళ్ళించావు? మరి ఇప్పుడు ఎందుకు వచ్చావు, నీళ్ళు కావాలని, నాదగ్గరికి?" ఇది అంటూ ఆవిడ చెరువుతో సహా మాయమయిపోయింది!

మొండిరాజుకు చెమటలు పట్టేసాయి. దాహంతో నాలుక పిడచుగట్టుక పోయింది. 'మరణిస్తానేమో' అని భయంతో అరవడం మొదలుపెట్టాడు.

అప్పుడే, ఎవరో అతని మొఖంమీద నీళ్ళు చిలకరించారు. "మహా ప్రభూ, తమరికి ఏమీ కాలేదు గద! ఇప్పుడు ఎలాగ ఉంది, తమరి ఆరోగ్యం?!" అని ఆతృతగా అడుగుతున్నదొక గొంతు. 'చెరువు మాయమైంది-నీళ్ళు ఇవ్వదట నాకు' గొణుగుతున్నాడు రాజు. "చెరువుకు ఏమీ కాలేదు ప్రభూ! బాగానే ఉంది చూడండి" చెబుతున్నదొక గొంతు. నెమ్మదిగా రాజుకి స్పృహ వచ్చింది. ఎదురుగా రాజభటుల బృందం ఒకటి నిలబడి ఉన్నది. రాజు పైకి లేచి, త్వరత్వరగా చెరువు దగ్గరికి వెళ్ళి చూశాడు. చెరువు ఎప్పటిలాగానే ప్రశాంతంగా ఉన్నది!

ఆకలిదప్పుల కారణంగా తను గొప్ప భ్రాంతికి లోనైనాడని గ్రహించాడు మొండి రాజు. అయితేనేమి, అతనిలో పెద్ద మార్పే వచ్చింది: అందరితోటీ మంచిగా ప్రవర్తించడం మొదలుపెట్టాడతను.

దేశ భాషలందు తెలుగు లెస్స



# నిజాయితీ

*రచన: కె.శీతల, 4 వ తరగతి, రిషివ్యాలీస్కూల్, మదనపల్లి, చిత్తూరుజిల్లా.*

రాజు కి ఏడు ఏళ్లు. రెండో తరగతి చదువుతున్నాడు.

ఒక రోజు వాళ్ళ మాస్టారు హోమ్‌వర్క్ ఇచ్చారు. తరువాతి రోజున " రాజూ హోమ్‌వర్క్ చేసావా?" అని అడిగారు మాస్టారు.

నిజానికి రాజు హోమ్‌వర్క్ చేయలేదు. కానీ "మాష్టారు ! హోమ్‌వర్క్ చేసాను- కానీ పుస్తకాలు తేవడంమర్చిపోయాను" అని అబద్ధం చెప్పాడు.

"సరే, రేపు మర్చిపోకుండా తీసుకురా!" అని చెప్పారు మాస్టారు.

ఆ తరువాత రోజు కూడా పుస్తకం మర్చిపోయానని అబద్ధం చెప్పాడు రాజు. అయితే మాస్టారు ఆ మాటని నమ్మలేదు- రాజు బ్యాగుని తెప్పించి దానిలో హోంవర్కు

పుస్తకం కోసం వెతికారు. పుస్తకం అందులోనే దొరికింది! మాస్టారు పుస్తకం తెరచి చూడగానే అర్థం అయిపోయింది- రాజు హోంవర్క్ చేయనేలేదు! పైపెచ్చు చేశానని అబద్ధం ఆడాడు!

అప్పటి నుంచి అందరూ రాజుని నమ్మటం మానేశారు.

ఇంకో రోజు అమ్మకి బాగోలేక "రాజూ!నాకు ఆరోగ్యం బాగా లేదు- కాస్త బయట చెత్త ఊడ్చు"అంది. బుద్ధిగా "సరేనమ్మా" అన్న రాజు, చెత్త ఊడవకుండానే బయటికెళ్ళి ఆడుకోవడం మొదలుపెట్టాడు. చీకటి పడ్డాక ఇంటికి తిరిగి వచ్చిన రాజుని అడిగింది అమ్మ- "బయట ఊడ్చావా,లేదారా రాజూ.. అసలు ఊడ్చినట్లే లేదు?" అని.

"ఊడ్చానమ్మా" అని జవాబిచ్చాడు రాజు ధీమని. ఇట్లా అతనికి అబద్ధాలు ఆడటం అలవాటయిపోయింది. ఇంట్లో తల్లిదండ్రులతోటే, బడిలో మాస్టారుతోటే కాక, వాళ్ళ స్నేహితులతోటి కూడా అబద్ధాలు ఆడసాగాడు అతను.

ఇంక అతనిని ఎవరు నమ్ముతారు? ఎవ్వరూ అతన్ని ఆటలలోకి చేర్చుకోవటం లేదు.

కొంత కాలానికి అర్థమైంది రాజుకు- తను చేస్తున్నది తప్పు. అబద్ధాలు ఆడకూడదు. అట్లా తన తప్పు తాను తెలుసుకున్న రాజు ఆ నాటినుండి అన్నీ నిజాలే చెప్పసాగాడు. అయినాగానీ అతన్ని ఎవరూ నమ్మడం లేదు. తను ఎంత నిజం పలికినా అందరూ "ఊరుకోరా, అబద్ధాలు చెప్పకు" అనే అంటున్నారు.

దాంతో అతనికి చాలా బాధ వేసింది. ఏడుపొచ్చింది. చివరికి ఒకరోజున రాజు ఏడుస్తూ వాళ్ల అమ్మ దగ్గరికి వచ్చి "అమ్మా! నన్ను ఎవ్వరూ నమ్మటం లేదు. నేను 'అబద్ధాల కోరు' అంటున్నారు అందరూ. నాకు ఏడుపొస్తున్నది" అన్నాడు.

రాజు వాళ్ళ అమ్మ అతన్ని ఓదార్చుతూ అతనికి 'నాయనా పులి వచ్చె ' కథని గుర్తుచేసింది. "చూసావా రాజూ? నాయనా పులి కథలో లాగానే నిన్ను ఎవరూ నమ్మడం లేదు. కానీ నువ్వు నిరాశ పడకు-ఎవరేమన్నా సరే బాధ

పడకుండా నిజాలే చెబుతూండు. కొన్ని రోజులకు అందరూ నిన్ను అర్థం చేసుకుంటారు- ఏం కాదు " అని చెప్పింది అమ్మ.

రాజు అమ్మ చెప్పినట్లు చేశాడు. తన స్నేహితులు ఎవరు ఏమన్నా కూడా తను నిజాలే చెబుతూపోయాడు. కొన్నాళ్ళకి "రాజు నిజాయితీపరుడు" అని అందరికీ అర్థమైంది.



నవ్వండి!

**ఐస్ వాటర్!**

కస్టమర్: ఏమయ్యా, సర్వరూ? 'ఐస్‌క్రీం' తెమ్మంటే 'ఐస్ వాటర్' తెచ్చావేంటి?

సర్వర్: ఏమో సార్, నేను తెచ్చేటప్పుడు క్రీమ్‌గానే ఉండింది; కానీ, ఇప్పుడు వాటరయ్యింది ఎందుకనో.

**మంచి మద్రాసు కాఫీ!**

కస్టమర్: తినేందుకు ఏమున్నాయి బాబూ?

సర్వర్: బెంగాల్ బజ్జీ, మైసూరు మసాలావడ, ఆంధ్రా అట్టు, కెనడా కాఫీ, టిబెట్టు టీ- మీకు ఏం తెమ్మంటారు సార్!?

కస్టమర్: అవేమీ వద్దు నాయనా, కాసిన్ని మచిలీపట్నం మంచినీళ్ళు తెచ్చివ్వు చాలు.




# స్వర్గం

*ఈ కథ ఏమంత పిల్లల కథలాగా లేదు- కానీ ఎక్కడో తిరుపతి నుండి నిఖిల్ సాయి పంపాడు కదా, అన్నట్లు ప్రచురించేస్తున్నాం.. బాగుంటే చెప్పండి.*
*సేకరణ: ఆర్ నిఖిల్ సాయి, 8 వతరగతి, ఆస్కార్ ఇంటర్నేషనల్ స్కూల్, యం.ఆర్.పల్లి, తిరుపతి.*

ధర్మాపురంలోకెల్లా పెద్ద ధనికుడు ధర్మయ్య. చాలా డబ్బులు, పలుకుబడి, రాజకీయ చతురత ఉన్నై, అతనికి. అధికారుల్లో అతనికి తెలియని వారంటూ లేరు.

అట్లాంటి ధర్మయ్య కూడా ఓరోజున గుండెనొప్పితో చనిపోయాడు.

యమ దూతలు అతన్ని నరకానికి తీసుకెళుతున్నారు.

ధర్మయ్య మటుకు తనను వెంటనే స్వర్గానికి తీసుకెళ్ళమని బలవంతం చేయటం మొదలు పెట్టాడు వాళ్లని.

"మేం తీసుకు వెళ్తాం, కానీ స్వర్గద్వారపు

కాపలాదారులని దాటుకునే శక్తి నీకు లేదు" అన్నారు యమభటులు.

"నాకు అన్ని శక్తులూ ఉన్నై" అని మొండికేశాడు ధర్మయ్య.

"సరే, నీ ఇష్టం, వాళ్ళు కాదంటే మటుకు నువ్వు కుంభీపాకంలో కి పోయి పడతావు- అక్కడికి దగ్గర్లో ఉన్నది అదే నరకం మరి-" అన్నారు యమభటులు అతన్ని వదిలేస్తూ.

"వాళ్ళు కాదంటే అప్పుడు చూద్దాం!" ధీమాగా బుకాయించి ధర్మయ్య స్వర్గం కోసం పోయాడు.

స్వర్గపు ద్వారం దగ్గర భటులు ఆపేశారు అతన్ని.

"నేను ఎవరో తెలుసా? నన్ను తెలియని పెద్దమనుషులే లేరు. ప్రపంచ ధనికుల్లో మొదటివాడిని నేను. నన్ను లోపలికి పంపించనంటారా?" చిందులేశాడు ధర్మయ్య.

"మీకు తెలిసిన వాళ్ల లిస్టు మాకు అందింది- నిజంగానే ఆ పట్టిక చాలా పెద్దది. కానీ ఆలిస్టులో మాకు 'భగవంతుడు' కనబడలేదు. నీ అంతరాత్మనే గుర్తించలేని వాడివి- నీకు స్వర్గంలో చోటు ఉండదు-" అని స్వర్గద్వారపాలకులు ధర్మయ్యను కుంభీపాక నరకంలోకి నెట్టేశారు.

ప్రేమ, ఆప్యాయత, ఇతరులకి మనం చేసిన మేలు- ఇలాంటివి మన అంతరంగాన్ని మనకు దగ్గర చేస్తాయి. మన స్వర్గానికి అవే దగ్గరి మెట్లు.

నవ్వు!

బడంటే కచ్చ ఉన్న పిల్లలు ఇద్దరు :

రాహుల్: ఇవాళ్ళ తరగతి గదిలో ఏమయిందో తెలుసా? గోడ గడియారం కిందపడిపోయింది. ఒక్క క్షణం ముందు గనక పడి ఉంటే, అది సూటిగా మనీషా టీచర్ తలపై పడి ఉండేది!

మనోజ్: హూ! ఆ గడియారం ఎప్పుడూ నిదానమే మరి?



# త్యాగశీలి

*సేకరణ: నవీన్‌కుమార్, 9 వతరగతి, పులేటిపల్లి, అనంతపురంజిల్లా.*

పూర్వం గంగానదీ తీరంలో అమరాపురం అనే ఊరు ఒకటి ఉండేది. కాశీ రాజు రాజశేఖరుడు దేశసంచారం చేస్తూ ఒకనాడు ఆ గ్రామం చేరుకున్నాడు. గంగానదిలో స్నానం చేసి అక్కడి దేవతలను పూజించాడు. నదీ తీరంలో ఎవరో పండితుడు పురాణం చెబుతూంటే వింటూ కూర్చున్నాడు. అంతలో నది దగ్గరినుండి కేకలు, ఏడుపులు వినబడ్డాయి- అందరూ అటువైపు పరుగుతీశారు. "నదిలో స్నానం చేస్తున్న నా భర్తను మొసలి పట్టుకొని నీటిలోకి లాక్కుపోయింది. ఎవరైనా తొందరగా వచ్చి రక్షించండి, రక్షించండి!" అంటూ కేకలు వేస్తున్నది, ఒకావిడ.

సాహసవంతుడైన రాజశేఖర్ నీటిలోకిదూకి, మొసలిని చంపి , అతన్ని కాపాడాడు.

అందరూ కలిసి పరిచర్యలు చేసి, అతన్ని తిరిగి స్పృహలోకి తెచ్చారు. ఆ మనిషి, అతని భార్య రాజశేఖరునికి నమస్క రించి "అయ్యా! నువ్వు చాలా సాహసవంతుడివి, పరోపకార గుణం ఉన్నవాడివి- కనుకనే మమ్మల్ని కాపాడావు. మేం సామాన్యులం- కృతజ్ఞతలు తెలపడం కంటే నీకేమి ప్రత్యుపకారం చేయగలం?" అన్నారు.

అప్పుడు రాజశేఖరుడు వాళ్ళతోమర్యాదగా "చింతించకండి, దీన్ని నేను నా బాధ్యతగా భావిస్తున్నాను. మీనుండి నేను ఏలాంటి ప్రత్యుపకారాన్నీ కోరటంలేదు" అన్నాడు.

అంతలో మొసలిబారిన పడిన వ్యక్తి ఏదో గుర్తుకు వచ్చినట్లుగా "అయ్యా! జ్ఞాపకం వచ్చింది- నా దగ్గర ఒక మంత్రముంది. దాన్ని నూట ఎనిమిది సార్లు జపిస్తే చాలు- అప్పటి వరకూ చేసిన పాపాలన్నీ తొలగిపోతాయి. మహాద్భుతమైన చక్రవర్తి యోగం ప్రాప్తిస్తుంది. అంతేకాదు- కోరుకున్నప్పుడు దేవలోకంనుంచి విమానం వచ్చి తీసుకువెళ్తుంది వాళ్లని. అయితే దాన్ని వేరే ఎవ్వరికీ ఉపదేశించ కూడదు- అట్లా ఉపదేశించినట్లయితే మొదటివారికి ఇక ఆ మంత్రం పనిచేయదు. ఆ మంత్రాన్ని మీకు ఉపదేశిస్తాను. ఈపాటి మేలయినా మీకు చేసే అవకాశమియ్యండి" ఆంటూ ఆ మంత్రాన్ని రాజుకు ఉపదేశించాడు. ఆ తర్వాత తమ దారిన తాము వెళ్ళిపోయారు వాళ్ళిద్దరూ.

రాజశేఖరుడు వాళ్ళ గురించే ఆలోచిస్తూ తన సంచారాన్ని కొనసాగించాడు. అతను అలా వింధ్యపర్వత ప్రాంతానికి చేరుకొనే సరికి చీకటి పడింది. ఆ సమయంలో అక్కడ ఒక పాడుబడిన దేవాలయం కనబడే సరికి, రాజశేఖరుడు అక్కడే విశ్రమించాడు.

ఆ దేవాలయం ముందున్న మర్రి చెట్టు మీద ఒక రాక్షసుడు నివసిస్తూ ఉన్నాడు. వాడికి కొంత కాలంగా ఆహారం దొరక్క, చాలా నీరసించి పోయి ఉన్నాడు. ఇప్పుడు కండలు తిరిగిన యోధుడొకడు తన పరిధిలోకే వచ్చేసరికి వాడి ఆనందానికి మేరలేకపోయింది. బాగా చీకటి పడనిచ్చి, వాడు గబుక్కున రాజు ముందుకు దూకి నిలబడ్డాడు. ఆ శబ్దానికి మెలకువ

వచ్చిన రాజశేఖరుడు తేరుకునేలోగానే బ్రహ్మరాక్షసుడు వచ్చి మీద పడ్డాడు.

ఇద్దరూ చాలా సేపు హోరా హోరీగా పోట్లాడాక, రాక్షసుడు ఓటమిని అంగీకరిస్తూ రాజశేఖరుడి కాళ్లమీద పడ్డాడు- "అయ్యా, మీరేనా మా గురుదేవులు చెప్పిన రాజశేఖరులవారు?" అంటూ.



రాజశేఖరుడు అవునన్న మీదట, వాడు సంతోషంతో కొంతసేపు గంతులు వేసి, అటుపైన తన కథ చెప్పసాగాడు- "అయ్యా! నేను ఇంతకుముందు మాళవదేశపు రాజపురోహితుడిగా ఉండేవాడిని. మా రాజు పండితులను అభిమానించేవాడు. వచ్చిన పండితుల విద్వత్తును పరీక్షించేందుకు నన్ను నియోగించేవాడు ఆయన. రాను రాను నేను చెప్పిన పండితులకే రాజుగారినుండి భూరి బహుమానాలు దొరకటం మొదలయింది. ఇట్లా జరుగుతుండేసరికి, కొంతకాలానికి ఈ పండితులకంటే 'నేనే గొప్ప వాడిని' అని నాలో గర్వం పెరిగింది. ఎంతటి పండితుడినైనా చులకనగా చూసేవాణ్ణి. ఒకరోజున గొప్ప గొప్ప శాస్త్రాలు చదువుకొన్న మహా పండితుడు ఒకాయన మా ఆస్థానానికి వచ్చాడు- తనను పరీక్షించి, తగిన బహుమానమిప్పించమంటూ. నేను, ఆయన్ని పరీక్షించకనే గర్వంతో ఎగతాళి చేసి అవమానించాను.

ఆయన కోపగించి "నా అంతటి శక్తిశాలినే ఇలా అవమాన పరచావు. నాకంటే ముందు ఎందరిని అవమానించావో! ఆ పాపం మొత్తం ఫలించుగాక! నువ్వు బ్రహ్మ రాక్షసుడివైపోదువుగాక!" అని శపించాడు.

మరుక్షణం నేను ఇలా బ్రహ్మరాక్షసుడినైపోయాను. భయంతో వణుకుతూ ఆయన కాళ్లపై పడి శాపవిమోచనం ఇమ్మని వేడుకున్నాను.

అప్పుడు ఆ పండితుడు నన్ను అనుగ్రహించి "మహిమాన్వితమైన మంత్రాన్నొకదాన్ని సాధన చేస్తే ఎనలేని లాభం ఉంటుందని తెలిసి కూడా సొంతానికి ఉపయోగించుకోని రాజశేఖరుడొకడు నీదగ్గరికి వచ్చి, నీపైన దయతో దాన్ని నీకు దానం చేస్తే తప్ప నీకు విముక్తి లేదు" అని సెలవిచ్చాడు. తమరు నాపైన దయ చూపండి. తమరికి తెలిసిన మంత్రాన్ని నాకు ఉపదేశించండి" అన్నాడు వాడు.

రాజశేఖరుడు తనకు తెలిసిన మంత్రాన్ని సునాయాసంగా ఆ రాక్షసుడికి ఉపదేశించాడు.

మరుక్షణం ఆ రాక్షసుడి స్థానంలో ఒక దివ్య పురుషుడు ప్రత్యక్షమై, "రాజా! జయం! జయం! నీ త్యాగబుద్ధి సహజమైనదో, కాదో తెలుసుకునేందుకు మేం పెట్టిన పరీక్ష ఇది- నువ్వు ఇందులో గెలిచావు. నీవంటి అద్భుత శీలం గలవాడికి మానవాతీత శక్తులతో పనిలేదని నిరూపించావు. జయోస్తు" అని మాయం అయిపోయాడు!



**దొందూ దొందే!**

అమ్మ: ఏం చేస్తున్నావు భానూ?

భాను: చిన్నారి షానూకు లెటెర్ రాస్తున్నానమ్మా

అమ్మ: ఎలా? నీకు రాయడం తెలీదు కదా?

భాను: అయితే ఏమిటి? షానుకూ చదవటం తెలీదు కదా!

**కాకి పిల్ల కాకికి ముద్దు**

తల్లి కాకి పిల్లకాకితో అంటోంది: ఎక్కువగా ఎండలో తిరగకమ్మా, నల్లబడి పోతావు!

# కాకి - పిల్లి

రచన: మణికంఠన్, 7 వతరగతి, రిషివ్యాలీస్కూల్, మదనపల్లి, చిత్తూరుజిల్లా.

ఒక ఊరులో పెద్ద రావి చెట్టు మీద, ఒక కాకి ఉంది. ఆ కాకి దగ్గర చాలా పాలు ఉన్నాయి.





ఆ చెట్టు దగ్గరే ఒక పిల్లి కూడా ఉంది. ఒక రోజు పిల్లికి చాలా దాహం వేసింది. అది కాకి దగ్గరకు వచ్చి

"కాకీ! కాకీ! నాకు కొంచెం పాలు ఇస్తావా?" అని అడిగింది.



అప్పుడు కాకి, "పాలు లేవు, గీలు లేవు, ఫో!!" అంది. పిల్లికి చాలా బాధ వేసింది.

కొన్ని రోజుల తరువాత, కాకికి చాలా దాహం వేసింది. అప్పుడు కాకి దగ్గర పాలు లేవు.



అది పిల్లి దగ్గరకు వెళ్ళి "పిల్లీ! నీళ్ళు ఇస్తావా?" అని అడిగింది.



పిల్లి కాకికి సంతోషంగా నీళ్ళు ఇచ్చింది.



అప్పుడు, అంతకు ముందు తను పిల్లికి పాలు ఇవ్వలేదన్న సంగతి గుర్తుకు వచ్చి, కాకి సిగ్గుతో తలవంచుకుంది.



# సీసా భూతం

రచన: డి.జ్యోతి, 7 వతరగతి, శ్రీవిద్యానికేతన్, ముకుందాపురం, అనంతపురంజిల్లా.

రజని, గోపి తోటలో బంతాట ఆడుతున్నారు.

అంతలో ఆ బంతి పోయి ముళ్ళకంపలో పడింది.

రజని, గోపి ఇద్దరూ ఆ బంతి కోసం వెళ్ళారు. బంతి కనిపించింది- అయితే బంతి పక్కనే అందమైన సీసా ఉంది.

"అరే, సీసా భలే అందంగా ఉంది" బంతితో పాటు సీసా కూడా తీసుకున్నారు పిల్లలిద్దరూ.

"సీసాలో ఏముందో చూద్దామా?!" అడిగాడు గోపి ఉత్సాహంగా.

"సరే మూత తీయ్" అంది రజని, తనూ ముందుకి వంగి.

మూత తీశాడు గోపి- అంతే- భగ భగ మని నల్లని పొగలు.... భయంకరమైన నవ్వు.... భయంకరమైన ఆకారంతో ఓ పె..ద్ద భూతం బయటికి వచ్చింది సీసాలో నుంచి. "ఆకలి... ఆకలి...మీ ఇద్దరినీ తింటాను" అన్నదది.

రజని, గోపిలకు భయంవేసింది. అయినా

రజని "భయం వద్దు గోపీ! నిన్న టీచర్ చెప్పిందికదా- ఆపదలు వచ్చినప్పుడు భయపడ వద్దని? భూతాన్ని మాటల్లోకి దించుదాం. తప్పించుకునేందుకు ఏదో ఒక ఉపాయం తట్టకపోదు" అన్నది.

"ఓ భూతమా! నీకు ఆకలి అయితే మా ఇద్దరినీ తీనేసెయ్. కానీ, నీకు తెలుసో తెలీదో- మేం ఇద్దరం చాలా తెలివైన వాళ్లం. అట్లాం టి మమ్మల్ని ఒక తెలివిలేని భూతం తినటం ఉన్నదే- అది మటుకు చాలా బాధగా ఉంది" అంది రజని.

"ఏమిటీ! నేను- తెలివి లేని దాన్నా?!" అంది భూతం, కోరలు చాపి.

"ఏమో, మాకైతే అట్లాగే అనిపిస్తున్నది. చేతనైతే మేం అడిగే పొడుపు కథలు విప్పు. నువ్వు తెలివిగల దానివి అని మేం ఒప్పుకొని, సంతోషంగా నీకు ఆహారం అవుతాం. నువ్వు సరైన జవాబులు చెప్పలేకపోతే మమ్మల్ని ఇద్దర్నీ తినకుండా విడిచిపెట్టాలి మరి" అన్నది రజని.

భూతానికి తన తెలివితేటలపైన చాలా నమ్మకం. "సరే చెప్పండి- చూద్దాం" అంది అది.

రజని ఇలా అడిగింది: 'రాజా వారి తోటలో రోజా పువ్వులు- చూసేవారే కానీ కోసేవారు లేరు'



భూతం ఎంత ఆలోచించినా సమాధానం దొరకలేదు. "ఈమాత్రం తెలీదా? ఆకాశంలో నక్షత్రాలు" అంది రజని.

ఈసారి గోపి అడిగాడు ఓ పొడుపుకథ: "గోడ మీద బొమ్మ -గొలుసులు బొమ్మ -వచ్చేపోయె వారికి -వడ్డించుబొమ్మా"

"ఓస్!ఇది తెలుసు నాకు- తేలు!" అంది భూతం.

"మరి నేను అడిగిన దానికి చెప్పు" అంటూ రజని ఇంకో పొడుపు కథని విడిచింది: 'పచ్చటి పొలంలో ఒంటికాలి రైతు- ఉలకడు-పలకడు' అని.

భూతం బిక్క మొహం వేసింది. "అయ్యో, దిష్టిబొమ్మ , తల్లీ!" అంది రజని చేత్తో నుదుటిని కొట్టుకుంటూ.

"అవునవును- ఇంకోటి అడుగు చెబుతాను- ఈసారి సరిగ్గా చెబుతాను" అంది భూతం ఉత్సాహంగా.

గోపి అడిగాడు ఈసారి- "కిరీటం పెట్టు కుంటాడు, కత్తితో పోరాడతాడు- కానీ రాజుకాదు- ఎవరది?" అని. భూతానికి ఇదీ రాలేదు.

"నేను చెబుతానులే- కోడి పుంజు" అన్నది రజని.

"మీరు చాలా మంచి పిల్లలు. నాకు ఇంకొక్క పొడుపుకథ వినిపించండి. ఆ తర్వాతనే మిమ్మల్ని తింటాను" అంది భూతం నవ్వుతూ. పిల్లలిద్దరూ అదిరి పడ్డట్లు చూశారు.

"మమ్మల్ని వదిలేస్తానన్నావుగా?" అంది రజని.

"ఊరికే అన్నాను" ఇకిలించింది భూతం.

"సరే అయితే ఇది చెప్పు: చేత్తో చల్లుతారు, నోటితో ఏరతారు- ఏమిటవి?" అడిగాడు గోపి. భూతం బుర్ర గోక్కున్నది.

ఆలోగా రజని "అక్షరాలు" అని ఒక కాగితం మీద రాసి, ఆ కాగితాన్ని గబుక్కున సీసాలో వేసేసింది "సమాధానం నేను చెప్పను- కాగితంలో రాసేసా- కానీ అది నీకు అందదు!" అని ఊరిస్తూ.

"ఎందుకు అందదు? నేను చదివేసి వస్తాను క్షణంలో" అని భూతం నల్లటి పొగలాగా మారి సీసాలోకి దూరింది-

అంతకంటే చలాకీగా ఉన్న రజని అరక్షణంలో సీసాకు మూత పెట్టేసింది!

పిల్లలిద్దరూ చలాకీగా నవ్వుతూ ఇంటికి పోతుంటే సీసాలో భూతం మటుకు గందర గోళంగా అటూఇటూ తిరిగింది.




# అందమైన రాజ్యం

*రచన: డి.సుబ్బులు, 6 వతరగతి, అరవిందామోడల్‌స్కూల్, మంగళగిరి, గుంటూరుజిల్లా.*

అది ఒక అందమైన సామ్రాజ్యం. ఆ దేశపు రాజయిన 'శ్రీ శ్రీ శ్రీ వెంకటా చలపతి' గారు దేవుడికి మరో రూపం. ప్రజలంటే ఆయనకు ప్రాణం. ప్రజల మేలుకోసం తన ప్రాణాలు కూడా లెక్కచేయని మంచి మనిషి ఆయన. ప్రజలకు కూడా ఆయనంటే ఎంతో ఇష్టం, ప్రేమ, గౌరవం.

ఎంతో అందమైన ఆ దేశంలో ఆ రాజావారి కోట చాలా గొప్పగా ఉండేది. రంగు రంగులు పూల చెట్లు, వాటిపైన అందంగా ఎగిరే పలు రకాల సీతాకోక చిలుకలు- వాటి మధ్యన నెలకొని ఉండేది ఆ కోట.

ఎందరో కవులు ఆ దేశాన్ని గురించి, ముఖ్యంగా ఆ కోట గురించి వర్ణించారు. ఆ దేశం అంతటా పచ్చదనం నిండి ఉండేది మరి.

అయితే రాజా వెంకట చలపతి గారికి

సంతానం లేదు. ఎవరైనా ఈ మాటను అడిగితే "నాకు పిల్లలు లేరా? ఎవరు చెప్పారు? నా ప్రజలే నా పిల్లలు" అనేవారాయన. మనస్సులో ఎంతో బాధ ఉన్నా, పైకి మటుకు నవ్వుతూ, ఆనందంగా ఉండేవారు. ఆయన ఎప్పుడూ ఒక మాట చెప్పేవారు- "నీ కోసం కాదు- నలుగురి కోసం జీవించు" అని.

ప్రతీ కథలోనూ రాక్షసులు ఉన్నట్లు, ఈ కథలో కూడా ఇద్దరు ఉన్నారు- ఒకడు ఫ్యాసీ, ఇంకోడు జ్యాసీ. ఫ్యాసీ ఒక దొంగ సన్యాసి. జ్యాసీ ఒక ప్రజానాయకుడు. వీళ్లు ఇద్దరూ అన్నదమ్ములు- కానీ ఈ విషయం ఎవరికీ తెలీదు.

ఫ్యాసీ గొప్ప రుషిలాగా నటిస్తూ ప్రజలని మోసం చేసేవాడు. జ్యాసీ ప్రజలకు ద్వేషం నూరిపోస్తూండేవాడు. చక్కని ఆ దేశాన్ని నాశనం చేయాలని ఆశించేవాళ్ళు వాళ్ళిద్దరూ.

ఫ్యాసీ ప్రజలలోకి వెళ్ళి "మన రాజు వెంకటా-చలపతి గారు ప్రతీ నిమిషం ఎంతో బాధ పడుతున్నారే, మీరు దాన్నిగురించి ఏమీ చేయట్లేదు " అనటంమొదలు పెట్టాడు. "అయితే ఏం చేయాలి చెప్పండి స్వామీ? ఆయనకి సంతానం కలగాలంటే ఏం చేయాలి?" అన్నారు ప్రజలు.

"నాకు నిన్న దేవీ మాత నుండి ఒక సూచన వచ్చింది. అదేమిటంటే వెంకటాచలపతి గారు రాజ్యం వదిలివెళ్ళాలి. జ్యాసీ రాజ్యాన్ని పాలించాలి. అప్పుడే అందరికీ మేలు జరుగుతుంది" అన్నాడు ఫ్యాసీ.



పాపం ప్రజలు ఆ మాటలు నిజమని నమ్మారు. రాజుగారిని రాజ్యం వదిలి వేయమని

బలవంతం చేశారు.

వెంకటాచలపతిగారికి అంతులేని కోపం వచ్చింది. "ప్రజలారా మీరంతా మోసపోయారు. అధికారం కోసం మిమ్మల్ని పిచ్చి వాళ్ళని చేస్తున్నాడు జ్యాసీ" అన్నాడాయన. “కాదు ప్రభూ! ఈ సంగతి మాకు ఫ్యాసీ సన్యాసి వివరించారు. దీనికీ జ్యాసీకీ ఏ సంబంధమూ లేదు" అన్నారు ప్రజలు.

"ఇప్పుడే వెళ్ళి ఆ దుర్మార్గుల అంతు చూస్తాను' అని ఆవేశంగా ఫ్యాసీ ఆశ్రమానికి వెళ్ళారు వెంకటా చలపతిగారు. అక్కడ జరిగిన పోట్లాటలో ఫ్యాసీ-జ్యాసీ లతోపాటు ఆయనా మరణించారు.

ఒంటరివారైన ఆ దేశ ప్రజలకు రాజావారి గుర్తుగా మిగిలింది ఇక ఆ కోట మాత్రమే. దాన్ని చూసినవాళ్ళంతా ఈరోజుకీ రాజావారి కథని గుర్తుచేసుకుంటూ ఉంటారు.






# పిరికి దయ్యం

*దయ్యం అంటే ఎట్లా ఉండాలి? ఇదిగో, సరిగ్గా ఇట్లాగే ఉండాలి.. తలుచుకున్నోళ్ళకల్లా నవ్వురావాలి. చదివిన వాళ్ళకల్లా మజా రావాలి. మాకు ఈ కథ చాలా చాలా నచ్చింది. మీకూ నచ్చుతుంది చదవండి, బాగుంది!*
*రచన: డా.ఎం.హరికిషన్, జనవిజ్ఞాన వేదిక, కర్నూలు.*

ఒకూర్లో ఇద్దరు అన్నదమ్ములు వుండేటోళ్ళు. ఇద్దరూ చిన్నప్పటి నుంచీ కలసిమెలసి వుండేటోళ్ళు, ఇద్దరికీ పెళ్ళిళ్ళయినాయి. పిల్లలూ పుట్నారు. చిన్నోడి పెండ్లాం బిడ్డలేమో చానా మంచోళ్ళు, ఎప్పుడూ పన్నెత్తి ప్రశ్నించేటోళ్ళు కాదు. కన్నెత్తి చూసేటోళ్ళు గాదు. ఏది చెబితే అది- ఇట్లా చెప్పడం ఆలస్యం అట్లా పరుగెత్తి చేసేటోళ్ళు.

కానీ పెద్దోని పెండ్లాం మాత్రం పెద్ద గయ్యాలిది. ఎప్పుడూ మొగునితోనూ, మరిదితోనూ, తోడికోడలితోనూ ఏదో ఒక దానికి వూకూకెనే కొట్లాట పెట్టుకొనేది. నోటికొచ్చినట్టల్లా తిట్టేది.

దాంతో చిన్నోడు లాభం లేదనుకోని పెండ్లాం బిడ్డలతో కలసి వేరు కాపురం పెట్టాలనుకున్నాడు. కానీ అట్లా పోయేటప్పుడు ఇంట్లోంచి ఒక్క సామాను గూడా తీసుకోని పోకుండా పెద్దోని పెండ్లాం అడ్డం పడింది. దాని నోటికి భయపడి పెద్దోడు గూడా కిమ్మనకుండా కుక్కిన పేను లెక్కవుండి పోయినాడు. దాంతో చిన్నోడు కట్టుబట్టలతో చేతిలో పైసా గూడా లేకుండా బైటపన్నాడు.

బతకాలంటే ఏదో ఒక పని చేసి పైసలు సంపాదించాలగదా. దాంతో పెండ్లాం బిడ్డలను తీసుకొని ప్రక్కనే ఉన్న పెద్ద అడవిలోనికి బయలుదేరినాడు. అడవిలో పోతావుంటే ఒకచోట ఒక పెద్ద మర్రిచెట్టు కనబడింది. దాని కింద వాళ్లని కూర్చోబెట్టి పెండ్లాం తో "ఏమే...నేనుపోయి చుట్టు పక్కల ఏవైనా మంచి చెట్లేమన్నా ఉన్నాయేమో చూసొస్తా. అంతలో నువ్వు అన్నం వండు " అన్నాడు. ఆమె సరేనని వెంటనే మూడు రాళ్ళుతీసుకోనొచ్చి పయిన మూకుడు పెట్టి కింద మంట వెలిగించింది. చిన్నోడు చుట్టుపక్కల అంతా వెతికి ఒకచెట్టు కనబడితే దాన్ని నరికి ముక్కలు చేసి మరలా మర్రిచెట్టు దగ్గరికి వచ్చినాడు.

ఆ మర్రి చెట్టు పైన ఒక దయ్యం ఉంది . అది ఉత్తపిరికిది. ఎవరైనా గట్టిగా ఒక్కరుపు అరిస్తే చాలు గజగజలాడిపోతాది. అది వీళ్ళని చూసి భయపడి చిటారుకొమ్మకు చేరి దాక్కొని చూడ సాగింది. చిన్నోడు చెట్టుకింద కూర్చొని కొడుకుతో " రేయ్... పోయి అక్కడ కట్టెలన్నీ తీసుకోనొచ్చి చిన్నచిన్న తుంటలు చేయి" అన్నాడు. వెంటనే వాడు "అట్లాగే నాన్నా" అని ఉరుక్కొంటూ పోయి కట్టెలన్నీ తీసుకోనొచ్చి చిన్నచిన్న ముక్కలుగా నరక సాగినాడు.

చిన్నోడు కూతురికేసి తిరిగి "పాపా... ఆ కట్టెల పైనున్న నార తీసి పక్కన పెట్టు. మంచి మంచి తాళ్ళు పేనుతాను" అన్నాడు. దానికా పాప "ఎందుకు నాన్నా తాళ్ళు?" అనడిగింది. దానికి వాడు "చెట్టు మీద ఒకడున్నాడులే... వాన్ని కట్టి తీసుకుపోడానికి.... ఐనా

నీకెందుకే అవన్నీ... నోర్మూసుకోని చెప్పిన పని చెయ్యక?" అన్నాడు. వెంటనే ఆ పాప పురుక్కుంటా పోయి గబగబా నార తీసి అందించసాగింది. అది చూసి దయ్యం అదిరిపడింది.

"ఓరి నాయనోయ్...వీడు తాళ్ళు పేనుతా వుంది నా కోసమేనా...అదీగాక వీడు ఏం చెబ్తే అది పెండ్లాం బిడ్డలు నోరెత్తకుండా చేస్తా వున్నారంటే వీడు మామూలోడు గాదు. ఎట్లాగో ఒకట్లా వీన్ని మంచి చేసుకోవాల. లేకుంటే కష్టం" అనుకోని ఆ తెలివిలేని దయ్యం గజగజగజ వణుక్కుంటూ కిందికి దిగింది.

దయ్యాన్ని చూసి అందరూ అదిరిపోయినారు. కానీ అది గజగజా వణికిపోతా వుంది గదా, అది చూసి చిన్నోడు ధైర్యాన్ని కూడగట్టుకున్నాడు. దయ్యం వణికిపోతా చేతులు కట్టుకోని "అయ్యా నేను నీకేం అపకారం చేసినాను, నా చెట్టు కింద కూచున్నారు. వంట చేసుకున్నారు. అన్నం తిన్నారు. కట్టెలు కొట్టుకున్నారు. నేనేమైనా అంటినా, ఐనా నన్ను కట్టెయ్యడానికి తాళ్ళు పేనుతా వున్నారు. ఇది న్యాయమేనా" అనింది.

దాంతో చిన్నోనికి విషయమంతా అర్థమైంది. తానేదో తమాషాగా అంటే ఇది నిజమనుకోనింది అను కోని "ఏయ్... దొరక్క దొరక్క దొరికినావు. నిన్ను వదిలే ప్రసక్తే లేదు. కట్టి వూర్లో పెద్దోళ్ళ దగ్గరికి తీసు కోని పోతే అందరూ మెచ్చుకోని తలా ఇంత వేసుకోని పెద్ద బహుమతే ఇస్తారు" అంటూ మరింత బెదిరించినాడు.



దానికా దయ్యం మరింతగా వణికిపోతా

"వద్దొద్దు...అంత పనిచెయ్యొద్దు. ఐనా వాళ్ళేంతిస్తారు. మహా అయితే పదివేలో ఇరవైవేలో ఇస్తారు... అంతే గదా... అదే నన్ను గనుక ఏమీ చెయ్యకపోతే ఈ మర్రి చెట్టు కింద ఏడు మూటల బంగారముంది. అందులో సగమిస్తా, కానీ మరలా ఎప్పుడూ ఇటువైపు రాగూడదు. సరేనా" అనింది. దానికి వాడు సరే అన్నాడు. దాంతో దయ్యం పోయి మూడున్నర మూటల బంగారం తీసుకోనొచ్చి వాని ముందు కుప్ప పోసింది.



వాడు సంబరంగా ఆ బంగారమంతా తీసుకోని వూరు చేరుకున్నాడు. దాంతో పెద్ద ఇండ్లు కట్టుకోని, నలభై ఎకరాల నీళ్ళు పారే పొలం కొనుక్కోని, పదిమంది పనివాళ్ళను పెట్టుకోని హాయిగా వ్యవసాయం చేసుకుంటా కాలం గడపసాగినాడు.

వాని వైభోగం చూసి వదినకు కన్ను కుట్టింది. ఇదేందబ్బా వీడు వుత్తచేతులతో వూపుకుంటా పోయి నెల తిరిగేసరికల్లా పెద్ద జమీందారులెక్క తయారయినాడు. ఇందులో ఏదో కథుంటాది. కనుక్కోవాల అనుకోని మొగున్ని పంపిచ్చింది. పెద్దోడొచ్చి అడిగే సరికి తమ్ముడు జరిగిందంతా పూసగుచ్చినట్టు వివరించినాడు.

తరువాత రోజు పెద్దోడు పెండ్లాం బిడ్డలను తీసుకోని అడవికి బైలుదేరినాడు. మర్రిచెట్టు పైనున్న దయ్యం వీన్ని చూసింది. "అరే...మరలా ఎవడో ఈ చెట్టు కిందకే వస్తున్నాడే... ఎందుకైనా మంచిది దాచిపెట్టుకోవాల" అనుకోని చిటారు కొమ్మకు చేరుకోనింది. వీడు సక్కగా ఆ మర్రిచెట్టు కిందకే చేరుకున్నాడు, నెమ్మదిగా తలెత్తి జాగ్రత్తగా పైకి చూసినాడు. చిటారు కొమ్మన

దయ్యం కనబడింది. "ఆహా... తమ్ముడు చెప్పింది నిజమే... ఈ రోజు నా పంట పండినట్టే" అనుకునాడు.

పెద్దోడు పెండ్లాంకేసి తిరిగి "నేను పోయి యాడన్నా మంచి చెట్టుందేమో చూసొస్తా... అంతలోపు నువ్వు అన్నం చేసిపెట్టు" అన్నాడు. దానికామె "ఏందీ... ఈ అడవిలో అన్నం చేసి పెట్టాల్నా.. భలే చెప్పినావులే .. నువ్వే యాడయినా పండ్లో కాయలో వుంటే చూసి తెంపుకోనిరా... ఈ పూటకు అవే తిందాం" అనింది. వాడు పెండ్లాన్ని ఏమీ అనలేక పోయి ఒక మంచి చెట్టు చూసి దాన్ని చిన్న చిన్న ముక్కలు చేసి మరలా మర్రిచెట్టు కిందకి వచ్చినాడు. వచ్చి కొడుకుతో "రేయ్...నీవు పోయి ఆ కట్టెలన్నీ తీసుకోనొచ్చి ఇక్కడ కుప్పేయి" అన్నాడు. దానికి వాడు "ఏందీ... నేను పోయి కట్టెలు తీసుకోని రావాల్నా... ఇంకేం పని లేదా నాకు. పో...పోయి నువ్వే తెచ్చుకోపో... నేను ఆడుకోవాలి" అంటూ రయ్యిమని అక్కన్నించి వెళ్లిపోయినాడు. చేసేదేమీ లేక పెద్దోడే కట్టెలన్నీ చెట్టు కిందకి మోసుకోనొచ్చినాడు.

ఆడుకుంటున్న కూతురితో "పాపా...పో..పోయి వాటికి నార తీయి. తాళ్ళు పేనుతా" అన్నాడు. దానికా పాప "అబ్బబ్బబ్బ... ఎప్పుడు చూడు ఆ పని చెయ్యి ఈ పని చెయ్యి అని ఒగటే విసిగిస్తా వుంటావు. ఏం నీకు చేతగాదా... పో..పోయి నువ్వే చేసుకో, నేను వుయ్యాలాట ఆడుకోవాల" అంటూ వెళ్ళిపోయింది.

దాంతో వాడే ఆ కట్టెల నారంతా తీసి మంచి తాడు ఒకటి పేని పైకి చూస్తా "ఏయ్ దయ్యం.. మర్యాదగా కిందకొచ్చి నాకు మూడున్నర మూటల బంగారమిస్తావా... లేక నిన్ను ఈ తాడుతో కట్టి వూర్లోకి తీసుకొని పోయి అందరి ముందు కిందా మీదా యేసి తన్నాల్నా" అని గట్టిగా అరచినాడు.

ఆ మాటలింటానే పైనున్న దయ్యానికి తిక్క లేసింది. సర్రున కిందకొచ్చి "ఏంరా... వచ్చినప్పటి నుంచీ చూస్తావున్నా...పెండ్లాం బిడ్డల్నే సరిగా పెట్టుకోలేనోనివి....నువ్వు నన్ను

తంతావా...ఏదీ తన్ను చూద్దాం" అంటూ ఒక లావు కట్టె తీసుకోని దొరికినోళ్ళని దొరికినట్టు కిందా మీదా యేసి బాగా తన్ని పంపిచ్చింది.

"ఓరి నాయనో! దురాశకి పోతే ఎంత పనైపోయింది, ఉన్న పళ్ళు రాలిపొయ్యినాయి. ఇంకెప్పుడూ దయ్యాలతో పెట్టుకోంరో!" అని అన్నవోళ్ళంతా ఊళ్ళోకొచ్చి పడినారు. వాళ్ళ కత విని ఊళ్ళో జనాలంతా ఒకటే ఇక ఇకలు-పకపకలు!





# బొంగరంలా తిరిగే గుడ్డు

*రచన: యస్.శంకరశివరావు, ఉపాధ్యాయుడు/ఇంద్రజాలికుడు, యంపియుపియస్, బద్దలాపురం, కనగానపల్లిమండలం, అనంతపురం జిల్లా.*

తొగరకుంట జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల వార్షికోత్సవ సందర్భంగా ఇంద్రజాల పదర్శన జరుగుతోంది. ప్రముఖ మెజిషియన్ "ఉత్తమ్" వేదిక పైకి వస్తూనే గాలిలో చేతులూపి జేబురుమాలును సృష్టించాడు. మరో క్షణంలో దాన్నే "జాతీయ జెండా"గా మార్చి అందరి చేతా చప్పట్లు కొట్టించాడు.

"మేధ" తొమ్మిదవ తరగతి చదువుతోంది. మేజిషియన్ చేస్తున్న ప్రతి అంశాన్నీ ఆసక్తితో గమనిస్తోంది.

అంతలో ఉత్తమ్ వేదిక పై నుండి అన్నాడు- "అమ్మాయిల్లో ఒకరు రండి, ఇక్కడికి!" అని.

క్షణం ఆలస్యం చెయ్యకుండా వెళ్ళింది మేధ. వెళ్ళింది. "నీ పేరు ఏంటి?- మేధనా, సరే-

ఎన్నో తరగతి? ఒకె- తొమ్మిదవ తరగతి" మైకులోనే పరిచయం చేసుకున్నాడు మేజిషియన్. అటుపైన ఆయన ప్రధానోపాధ్యాయుడ్ని ఉద్దేశించి "సార్! డజను గుడ్లు తెప్పించండి సార్! వాటితో మ్యాజిక్ చేద్దాం" అన్నాడు.

ప్రధానోపాధ్యాయులవారు వెంటనే తెప్పించి ఇచ్చారు.



"సారు గుడ్లు తెప్పించారు- వీటిని చక్కగా పేర్చి ఇవ్వు నాయనా" అన్నాడు ఉత్తమ్ వాటిని తన అనుచరుడికి అందిస్తూ. అతను వాటిని ఒక పళ్ళెంలో చక్కగా అమర్చి తెచ్చి ఇచ్చాడు. "మేధా! ఇటు రామ్మా!" అన్నాడు. మేజిషియన్. మేధ అతని ముందు నిలబడింది.

"ఈ గుడ్లలోంచి నువ్వు ఒకటి, నేను ఒకటి తీసుకుందాం- సరేనామ్మా?" అన్నాడు ఉత్తమ్. మేధ ముందుకెళ్ళింది- ఇద్దరూ చెరొక గుడ్డునూ చేతులోకి తీసుకున్నారు.

"నేను చేసినట్లు నువ్వూ చెయ్యాలి- జాగ్రత్తగా చూడు పాపా" అన్నాడు ఉత్తమ్. "సరే" అంది మేధ.

"అబ్రకదబ్రా" అంటూ మెజిషియన్ తన మంత్రదండాన్ని తన చేతిలోని గుడ్డుకు తాకించాడు.

"నాకూ ఇవ్వండి మంత్రదండాన్ని-" అని మేధ ఆ మంత్ర దండాన్ని తీసుకొని "అబ్రక దబ్రా"అంటూ తన గుడ్డు చుట్టూ తిప్పింది.

"నువ్వు చాలా తెలివైన పాపవి మేధా! ముందు నీ గుడ్డుని కూడా మంత్రంతో నింపేశావు. ఇదిగో ఇప్పుడు చూడు- ఈ గుడ్డును ఎలా

తిప్పుతానో " అంటూ మెజీషియన్ తన చేతిలో ఉన్న గుడ్డును బల్ల పైన నిలబెట్టి, వేళ్ళతో బొంగరంలా తిప్పాడు- అది నిజం బొంగరంలాగే గిరగిర తిరుగుతూంది.

"మేధా! ఇప్పుడు నీ గుడ్డును తిప్పు!" అన్నాడు ఉత్తమ్.

మేధ తన చేతిలోని గుడ్డును టేబుల్ మీద పెట్టి తిప్పాలని చూసింది- కానీ గుడ్డు నిల్చోలేదు, తిరగలేదు! ఎంత ప్రయత్నించినా దబ్బున క్రిందపడిపోతున్నది!

మేజిషియన్ చేతిలోని గుడ్డు మాత్రం ఎన్నిసార్లు తిప్పినా తిరుగుతోంది చక్కగా!

"చాల్లేమ్మా! నీ మంత్రం ఏదో పనిచేసినట్లు లేదు- ఇప్పుడు ఈ రెండింటినీ పక్కన పెట్టి, ఇంకో పని చేద్దాం" అన్నాడు మెజీషియన్. సహాయకుడు వచ్చి వీళ్ళ చేతుల్లోని రెండు గుడ్లనూ తీసుకెళ్ళాడు.

"మనం ఇద్దరం మళ్ళీ చెరొక గుడ్డు తీసుకుందాం" అంటూ మెజీషియన్ తన ముందున్న ప్లేటులోంచి ఒక గుడ్డును చేతిలోకి తీసుకున్నాడు. మేధ గుడ్లన్నిటినీ బాగా పరిశీలించి తనకు నచ్చిన గుడ్డునొకదాన్ని తీసుకున్నది.

"అబ్రకదబ్రా" అంటూ మంత్రదండాన్ని గుడ్డు చుట్టూ తిప్పాక- "ఇప్పుడు నాలాగే చెయ్యమ్మా, చూద్దాం" అని మేజిషియన్ ఆ గుడ్డుని తన చెవి వెనుక భాగాన పెట్టి గట్టిగా ఒత్తాడు. ఆ తర్వాత అతను చేతిని తీసినా గుడ్డు మటుకు చెవి వెనకే అతుక్కొని ఉండిపోయింది! చెవి వెనక వైపున ఎటువంటి ఆధారం కాని, జిగురు కాని లేదు- కానీ గుడ్డు మాత్రం కమ్మలాగ అతుక్కుని వేలాడుతోంది.



వెంటనే మేధా తన చేతిలోని గుడ్డునూ చెవి వెనక పెట్టుకొని ఒత్తింది. మెల్లగా చెయ్యి తీసేసరికి, గుడ్డు కూడా చేతిలోకే వచ్చింది! మరో రెండు సార్లు ప్రయత్నించాక, మూడోసారికి అది కిందపడి పగిలిపోయింది!

మేధ చిన్నబోయింది- కానీ అక్కడ చేరినవాళ్ళు అందరూ మెజీషియన్‌ను మెచ్చుకుంటూ చప్పట్లు చరిచారు.

ఇంద్రజాల ప్రదర్శన ముగిసింది. మేధ ఇంటికి చేరింది.

ఆ రోజు రాత్రి మేధాకు నిద్రపట్టలేదు. ఒకటే ఆలోచన- "ఎందుకు? ఏమిటి? ఎలా జరిగినై ఇవన్నీ?" అని. "ఎలాగైనా వాటి వెనక ఉన్న రహస్యం తెలుసుకోవాలి... ఎవరు చెబుతారు?" అని ఆలోచించింది. "ఆ...!" ఆలోచన తట్టింది-

గత సంవత్సరం జనవిజ్ఞాన వేదిక సభ్యుడు శివరాం తమ బడికి వచ్చాడు. "సైన్సా? మహిమలా?" అని ఒక మ్యాజిక్ కార్యక్రమం నిర్వహించాడు. ఆయనైతే చెప్పగలడు- అప్పట్లో తను ఆయన ఫోను నంబరును పుస్తకంలో రాసిపెట్టుకున్నది కూడాను-"

నంబరు వెతికి శివరాం గారికి ఫోన్ చేసింది మేధ. శివరామ్ స్పందిస్తూ "ఆదివారంనాడు మీ బడికి వస్తాను పాపా, మీ తరగతిలో ఉత్సాహం ఉన్న పిల్లలందరినీ తీసుకునిరా! అందరికీ ఆ మ్యాజిక్ నేర్పిస్తాను అన్నాడు".

అన్నట్టే వచ్చారు శివరాం గారు. యాభైమంది దాకా పిల్లలు వచ్చి కూర్చున్నారు. "మ్యాజిక్ నేర్చుకుందామా?" అడిగారు శివరాంగారు.

"ఓ..!" అన్నారు పిల్లలు ఉత్సాహంగా.

డజను గుడ్లు తెమ్మన్నారు శివరాంగారు. "మ్యాజిక్ చేసే ముందు కొంత హోమ్ వర్క్ చేసుకోవాలి!" అన్నారు.

"ఈ గుడ్లను ఉడక బెట్టుకొని తీసుకునిరా!" అని నాలుగు గుడ్లు ఇచ్చారు.

మేధా బడి కిచెన్ లోకి వెళ్ళి గబుక్కున వాటిని ఉడక బెట్టి తెచ్చింది. వాటిని ఒక పక్కగా పెట్టించారు శివరాం గారు.

ఆ తర్వా త మరో రెండు గుడ్లను తీసుకున్నారు. "ఇదిగో, వీటికి నిలువుగా-

కింద ఒక రంధ్రం , పైన ఒక రంధ్రం చేయాలి సూదితో- జాగ్రత్త! పగలకూడదు సుమా!" అన్నారు.

మేధ తెలివైన పాప. జాగ్రత్తగా రెండు గుడ్లకూ రంధ్రాలు చేసింది.

"ఇదిగో, ఇప్పుడు ఈ సిరంజి తీసుకొని, ఆ రంధ్రాల్లో దూర్చి, గ్రుడ్లలోని సొన మొత్తం బయటికి తీసెయ్యాలి- గుడ్డు పగలకూడదు- జాగ్రత్తగా కొంచెం కొంచెంగా తీస్తే సరి" అంటూ ఒక ఇంజక్షన్ సిరంజిని ఇచ్చారుశివరాం గారు.

రెండు గ్రుడ్లలోకీ సిరెంజి గుచ్చి, లోపలున్న సొనలను లాగేసి, డొల్లలుగా చేసింది మేధ.

"ఇప్పుడు గ్రుడ్లను శుభ్రంగా తుడిచి, రంధ్రాలు కనపడకుండా "వైట్‌నర్" తో మూసివేయాలి..."

"భలే బాగుంది ఐడియా!" అంటూ సంబరపడింది మేధ.

శివరామ్ మేధకు రహస్యంగా చెవిలో ఏదో చెప్పాడు.

"సరే ..సరే! అర్థమైంది" అంటూ మురిసిపోయింది ఆ పాప.

"పిల్లలు! ఇప్పుడు మేధ మనకు రెండు మ్యాజిక్కులు చూపిస్తుంది- దానితోబాటు అవి ఎలా చెయ్యాలో కూడా నేర్పుతుంది. నేర్చుకోండి" అన్నారు శివరాం గారు.

పిల్లలు నిశ్శబ్దంగా కూర్చున్నారు.

"మైడియర్ స్టూడెంట్స్! ఇవిగో ఇక్కడ గుడ్లు చూడండి- ఎవరైనా ఒకరు రండి!" అంది మేధ.

గబుక్కున వచ్చి నిల్చున్నది ఇందు.

ఈ పళ్లెంలో ఉన్న గుడ్లలోంచి నువ్వు ఒకటి తీసుకో, నేను ఒకటి తీసుకుంటాను" అని చెప్పి ఉడికిన గుడ్డును తను తీసుకున్నది మేధ.

ఇందు చేతికి మామూలు గుడ్డు వచ్చింది.

"అబ్రక దాబ్రా" అంటూ తన చేతిలోని ఉడికిన గుడ్డును బల్లమీద పెట్టి బొంగరంలాగా తిప్పింది మేధ. అది నిజం బొంగరం లాగే గిరిగిరా తిరిగింది. ఇందు చేతిలోని మామూలు గుడ్డు మాత్రం తిరగలేదు.

"ఎందుకు తిరగలేదు?" అడిగారు పిల్లలు.

"ఇందు చేతిలోఉన్నది ఉడకని గుడ్డు. దాని సొన ద్రవంలాగా ఉంటుంది. ఆ గుడ్డును నిలబెట్టి తిప్పినప్పుడు భూమ్యాకర్షణ వల్ల దానిలోని సొన అంతా వేరువేరుగా తిరగటం వల్ల, గుడ్డు స్థిరత్వం కోల్పోయి, క్రింద పడిపోతుంది- తిరగదు.

అయితే నా చేతిలో ఉన్నది ఉడికిన గుడ్డు- దీనిలో సొన అంతా గడ్డ కట్టి ఉంటుంది. ఇంకేముంది? అది చక్కగా తిరుగుతుంది" వివరించింది మేధ. పిల్లలందరూ చప్పట్లు కొట్టారు. కొందరు వచ్చి ఉడికిన గుడ్డునూ, ఉడకని గుడ్డునూ వేరువేరుగా త్రిప్పి చూసారు. కేరింతలు కొట్టారు.

"ఇదిగో, రెండవ అంశం చూడండి" అని ఇందు, మేధ ఇద్దరూ చెరొక గుడ్డునూ తీసుకున్నారు.

మేధ తన దగ్గరున్న గుడ్డును చెవి వెనుక భాగానికి అతికించు కుంది. ఇందు చేతిలోని గుడ్డు మాత్రం జారి కింద పడింది; పగిలిపోయింది!

రహస్యం చెప్పమన్నారు పిల్లలు.

"ఇదిగో, నా దగ్గరున్నది డొల్లగా ఉన్న గుడ్డు. ఇందులో సొన లేదు, కనుక ఇది చాలా తేలికగా ఉంటుంది. కోడిగుడ్డు ఆకారం వల్ల, దాని అంచు చెవి వెనుక అతుక్కుంటుంది- ఇదిగో ఇలాగ.

అయితే ఇందూకి ఇచ్చింది నిజమైనగుడ్డు. అది బరువుగా ఉంటుంది; దానిలోని సొన ద్రవంలాగా కూడా ఉంటుంది. అది చెవికి అంటుకొని నిలవలేదు- జారి పడిపోతుంది.." చెప్పింది మేధ.

"మరి గుడ్లు తీసుకునేప్పుడు కన్ఫ్యూజ్ అయితే ఎలాగ?" అడిగాడు సునీల్.

"కన్ఫ్యూజ్ అయితే అంతే సంగతులు. జాగ్రత్తగా ఉండాల్సిందే. వీటిని గుర్తు పెట్టుకొని, తామే తీసుకోవాలి మెజీషియన్లు- ఎట్టి పరిస్థితుల్లోనూ ప్రత్యేకమైన గ్రుడ్లు ప్రేక్షకులకు అందకూడదు- అదే కిటుకు ఇందులో.." నవ్వారు శివరాం గారు సభను ముగిస్తూ.




# మెదడు లేని గాడిద

*మెదడు, గుండె, కాలేయం ఉంచుకుంటే మంచిది- ఎందుకో ఇదిగో, ఈ కథ చదివితే తెలుస్తుంది...*

ఊళ్లో ఓ పేదవాడు పెంచుకునే గాడిద ఒకటి, బాగా ఒక్క చిక్కి పోయి ఉండేది. దగ్గర అడవిలో పచ్చగడ్డి కనిపించే సరికి, ఆశకొద్దీ అది అటు వైపుగా వచ్చి మేయటం మొదలు పెట్టింది. ఆ అడవిలోనే భయంకరమైన సింహం ఒకటి ఉండేది. ఆ మధ్యనే అది ఒక ఏనుగుతో పోరాడి చాలా గాయాలు తగిలించుకొని ఉన్నది - కొద్ది కాలంగా వేటాడటం, అదీ వీలవ్వటం లేదు దానికి, అందుకని , అది తనకు తెలిసిన నక్కనొక దాన్ని పిలిచి, "ఓరే, నాకు యీ గాయాల కారణంగా అడవిలోకి వెళ్లి వేటాడటం కుదరట్లేదు. బాగా ఆకలిగా ఉంది. అందుకని ఒకపని చెయ్యి - నీ తెలివితేటలను ఉపయోగించి, అడవిలో కనబడ్డ ఏ దున్నపోతునో, గాడిదనో, గుర్రాన్నో నా గుహ

దగ్గరికి తీసుకురా. నేను ఒక్క ఉదుటన దాని మీదికి దూకి చంపేస్తాను. అట్లా నీకూ ఎంతో కొంత తినటానికి దొరుకుతుంది కూడాను. చూడు, మరి!" అన్నది.

నక్క అడవిలో కొద్దిసేపు తిరిగిందో, లేదో, దానికి మన గాడిద కనబడింది. నక్క దాని దగ్గరికి వెళ్లి మర్యాదగా పలకరించి, "గాడిద బావా! ఏంటి, నీ కథ? ఇంత చిక్కిపోయావెందుకు? మేత సరిగ్గా దొరకటం లేదా? అడవి అంతా మంచి పచ్చగడ్డి, కొల్లగా ఉంది గద?" అన్నది.

"అంతా దైవేచ్ఛ! దేవుడి ఇష్టం ప్రకారమే యీ జగత్తులో ఏదైనా జరుగుతుంది, ప్రాణాలు కులాసాగా తిరగాలన్నా, రోగాలతో బాధపడాలన్నా - దేనికైనా ఆ భగవంతుడి సంకల్పం అవసరం. ఆయన శక్తి ముందు మనం ఏపాటి?" అన్నది గాడిద.

"అయ్యో! బావా! నువ్వు ఎక్కడో తప్పుగా అర్థం చేసుకున్నావు. 'తృప్తి' అంటేనూ, 'దైవేచ్ఛ' అంటేనూ ఏమిటో నీకు సరిగా అర్థం అయినట్లు లేదు. 'నీ జీవితానికి అధారమైన ఆహారాన్ని మిగిలిన అన్ని ప్రాణులలాగానే నువ్వూ వెతుక్కోవాలి' - ఇదే దైవేచ్ఛ అంటే" అన్నది నక్క.

గాడిద అన్నది - "నక్క బావా! తృప్తిగా ఉండటం వల్ల చచ్చిపోయిన వాడెవరూ నాకు ఇంత వరకూ కనబడలేదు. అట్లాగే , ఆశగా కోరినంత మాత్రాన రాజైపోయిన వాణ్ణీ నేనెన్నడూ చూడలేదు.

"పో, బావా! నీ వేదాంతం అంతా తప్పు" అన్నది నక్క.

రెండూ ఈ వరసలో కొంత సేపు వాదులాడుకున్నాక, నక్క తన చివరి అస్త్రాన్ని 'ఆశ' అనేదాన్ని - ప్రయోగించింది". చూడు బావా! ఇవన్నీ వట్టి మాటలు, నాకు ఇవేమీ చెప్పకు, ఇక్కడికి దగ్గర్లోనే దుబ్బులు దుబ్బులుగా పచ్చగడ్డి పెరిగిన ప్రదేశం ఒకటి ఉన్నది. నీలాంటి జంతువులకు స్వర్గం అంటే అదే. నువ్వు అక్కడికి వస్తానంటే రా, దారి చూపిస్తాను, లేకపోతే నా దారిన నేను పోతాను," అన్నది.

నిరంతరం ఆకలితో అలమటించిపోతున్న

గాడిద మొహం ఆ మాటలకు వికసించింది. తన వాదనలను కట్టి పెట్టి అది నక్క వెంబడి, అది చూపిస్తానన్న స్వర్గాన్ని అనుభూతి చెందటం కోసం బయలు దేరింది.

చాలా దూరం నుండే దాన్ని చూసింది సింహం. మరుక్షణం దానికి నోట్లోనీళ్లు ఊరటం మొదలు పెట్టాయి. గాడిద ఆత్రం కొద్దీ ఇంకా దూరంగా ఉండగానే అది దాని వైపుకు లంఘించి బోయింది. కానీ అది చాలా బలహీనంగా ఉందేమో, గాడిదను చేరకనే బొక్క బోర్లా పడి, ఇక లేవలేక గట్టిగా మూలిగింది! గాడిద కంగారుగా వెనక్కి తిరిగి పరుగో పరుగు!

నక్క సింహం దగ్గరికి వచ్చి నిలబడి - "ప్రభూ! తమరు ఇంకొంచెం ఓపిక పట్టి, మరి కాస్త తెలివివిని ప్రదర్శించి ఉంటే సరిపోయేది కదా, యీ గాడిద తమరి భోజనం అయి కూర్చొనేది!" అన్నది విచారంగా.

తొందర పాటు వల్ల చేతికందిన ఆహారాన్ని పోగొట్టుకున్న సింహం గట్టిగా నిట్టూర్చి - "నన్ను క్షమించు మిత్రమా! నువ్వన్నది నిజం. తొందర పాటు ఎంత చేటో చూడు, అయినా నీ ప్రయత్నం గొప్పది; నీ తెలివి అమోఘమైనది. విరమించుకోకు, మరొక్కసారి ఆ గాడిదను ఏదో ఒక విధంగా ఇక్కడికి తీసుకురా; కాదనకు. యీ సారి నేను ఏం చేస్తానో చూడు" అన్నది.

"ప్రభూ! నేను ఇంకో సారి ప్రయత్నించి చూస్తాను, ఏదో ఒక మాయ చేసి, ఆ గాడిదను మళ్లీ మీ గుహ దగ్గరికి తెస్తాను. కానీ యీ సారి తమరు తొందరపడకండి- నిగ్రహంతో పనిని సాధించాలి" అని చెప్పి, తిరిగి గాడిదను వెతుక్కుంటూ బయలుదేరింది నక్క.

నక్కని చూసి గాడిద వణికి పోయింది- "బావా! ఏమిటిది? 'స్వర్గాన్ని చూపిస్తాను' అని తీసుకెళ్లి నన్ను నేరుగా సింహం నోట్లోకే తోశావే! నీకు నేనేం అపకారం చేశానని, ఇంత పని చేశావు?" నిలదీసింది అది, నక్కని.

నక్క ఆశ్చర్యాన్ని నటిస్తూ - "ఏంటి?! సింహమా?! అదెక్కడున్నది?! యీ అడవిలో ఇన్నేళ్లుగా ఉంటున్నాను -

ఒక్కటంటే ఒక్క సింహమూ కనబడలేదే, నాకు?! నీకెక్కడ కనబడింది?!" అన్నది.

"ఊరికే కనబడటమా?! లేదు! అది నేరుగా నా మీదికే దూకితేను!" అన్నది గాడిద, ఆ ఆలోచనకే మళ్లీ చెమటలు పోస్తుండగా.



"ఊరుకో గాడిద బావా! నీకు భ్రమ రోగం ఏదో ఉన్నట్లుంది. లేకపోతే, నాకు కనబడని సింహం నీకు కనబడటమేమిటి, నీ ప్రక్కన నేనుండగానే అది నీ మీదికి దూకటం ఏంటి, మళ్లీ నిన్ను వది లెయ్యటం ఏంటి? నిజంగా సింహం నోటచిక్కి తప్పించుకోగలరా, ఎవరన్నా?! నీ భ్రమనిక కట్టిపెట్టు" అన్నది నక్క, గాడిద అనుభవాన్ని కొట్టిపారేస్తూ.

గాడిద ఆ మాటలకు ఒట్టి గాడిదే అయిపోయింది: తన అనుభవాన్ని తానే అనుమానించింది. "అవునా! నిజంగానే?! నేను భ్రమ పడ్డట్లున్నాను! ఎంత భయపడ్డానో చూడు, అనవసరంగా! అసలక్కడ సింహమే లేదు! నా వెర్రిభయం కూల! పద, వెళ్లి హాయిగా గడ్డి మేస్తాను పద" అని అది మళ్లీ నక్క వెంబడి బయలుదేరి వచ్చింది.

యీ సారి సింహం ఓపిక పట్టింది. అది బాగా దగ్గరికి వచ్చాక దొరికించుకొని దాన్ని ఒక్క దెబ్బకే విజయవంతంగా చంపేసింది.

అయితే ఆ సరికి దానికి బాగా దాహం అవుతున్నది. 'ముందు నీళ్లు త్రాగి వస్తే, ఆనక కడుపారా మాంసం తినచ్చు' అని అది గాడిద శరీరానికి నక్కని కాపలాగా ఉంచి, తను నది దగ్గరికి వెళ్లింది. అట్లా వెళ్లిన సింహం వెనక్కి తిరిగి వచ్చేంత వరకు తాళలేక పోయిందినక్క!

అది గబగబా గాడిద మెదడును, గుండెను, రుచిగా ఉండే ఇతర భాగాలను

గుటుక్కుమనిపించి, ఏమీ ఎరగని దాని తీరున, మామూలుగా కూర్చున్నది.

సింహం వచ్చి చూసే సరికి, గాడిద శరీరంలో ముఖ్యమైన భాగాలేవీ లేవు.

"అరే, దీని మెదడు, గుండె, కాలేయం ఏమైనాయి?" అని అడిగిందది నక్కని, ఆశ్చర్యపోతూ.

"అయ్యో! యీ గాడిదకు అసలు అవేవీ లేవు ప్రభూ! మెదడు, గుండె ఏ కొంచెం ఉన్నా ఆ గాడిద రెండోసారి తమరి గుహ దగ్గరికి వచ్చేందుకు సాహసించేదా, మీరే చెప్పండి " అన్నది నక్క వినయం నటిస్తూ.

పరమ సుందరములు ఫలములు, సంసార
విషమహీజనమునకు వెలయు రెండు
సాధు సంగమంబు, సత్కావ్యపఠనంబు
లలిత సుగుణజాల! తెలుగుబాల!

హంసలందు బకము హాస్యాస్పదంబగు
మణుల గాజుపూస గణుతి గనదు
చదువురాని మొద్దు సభల రాణించడు
లలిత సుగుణజాల! తెలుగుబాల!

బ్రతికినన్నినాళ్లు ఫలములిచ్చుటెగాదు
చచ్చికూడ చీల్చి ఇచ్చు తనువు
త్యాగభావమునకు తరువులే
గురువులు
లలిత సుగుణజాల! తెలుగుబాల!

అందమైన సూక్తి అరుణోదయంబట్లు
బాల మానసముల మేలుకొల్పు
సూక్తిలేని మాట శృతిలేని పాటరా
లలిత సుగుణజాల! తెలుగుబాల!

-జంధ్యాల పాపయ్య శాస్త్రిగారి 'తెలుగు బాల' పద్యాలు

# బొమ్మకు కథ రాయండి

నిర్వహణ: శ్రీమతి జి.లలిత, telugu4kids.com




అబ్బ! వేగం ఎక్కువైపోతున్నది. పెట్రోలు వాడకమూ ఎక్కువైపోతున్నది. మరి పెట్రోలు ధరలు? అవీ ఎంత ఎక్కువైపోతున్నాయో! ప్రపంచం మొత్తం పెట్రో సంక్షోభంలో కూరుకుపోతున్నది. దాన్ని గురించి ఓ చక్కని కథ ఏమైనా తడుతుందేమో, ప్రయత్నించరాదూ?! కథ రాయగానే మాకు పంపండి మరి:

కొత్తపల్లి బృందం, యంఆర్వోఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా- 515101

ఫోను: 08559 240222, 7702877670 ఇమెయిలు: team@kottapalli.in

# మలాలా యూసుఫ్‌జాయ్ 

యువ కెరటాలు



ప్రపంచంలో అన్ని చోట్లా మనుషులూ, ప్రభుత్వాలూ ఒకలా ఉండరు. ఒక్కొక్క చోట కొన్ని కొన్ని ప్రవర్తనా నియమావళులు ఉంటాయి. మనం చేత్తో తిన్నట్లే కొన్ని దేశాల్లో ఫోర్క్-కత్తి వాడి తింటారు, అలాగ. కొన్ని దేశాల్లో, ప్రజలపై ఆంక్షలు కూడా ఉంటాయి - ఇవి చేయాలి, ఇవి చేయకూడదు అని. తాలిబాన్ల రాజ్యంలో స్త్రీలు చదువుకోవడం నిషిద్ధం (ఇప్పటికీ కొన్ని చోట్ల అమలులో ఉంది). అలాంటి ప్రాంతాలలో పాకిస్తాన్ లోని స్వాట్ లోయ ప్రాంతం ఒకటి. మలాలా అక్కడ ఉండే ఒక పదిహేనేళ్ళ అమ్మాయి. విశేషం ఏమిటి అంటే, ఇంత చిన్న వయసులోనే తను మహిళల చదువు కోసం ఇతర హక్కుల కోసం విశేషంగా పోరాడి అంతర్జాతీయంగా ఎంతో పేరు సంపాదించింది. తన ప్రాంతపు "జిల్లా పిల్లల అసెంబ్లీ" కి చెయిర్‌పర్సన్గా కూడా పనిచేసింది. ఆ అమ్మాయి గురించే ఇప్పుడు పరిచయం చేయబోతున్నది.

చిన్నప్పటి నుండే విద్యావేత్త అయిన తండ్రి ప్రభావంలో మలాలా రాజకీయాల గురించి తెలుసుకుంది. పదకొండేళ్ళ వయసులోనే "చదువు అనే నా ప్రాథమిక హక్కును వద్దనడానికి తాలిబాన్లకి ఎంత ధైర్యం?" అని ప్రశ్నించింది. ఆ సందర్భంగా ఆమె ఇచ్చిన ప్రసంగం టీవీల్లో, పేపర్లలో కూడా వచ్చింది. పన్నెండేళ్ళ వయసులో - తాలిబాన్ పాలనలో అమ్మాయిగా తన జీవితాన్ని వర్ణిస్తూ బి.బి.సి(బ్రిటీష్ బ్రాడ్కాస్టింగ్ కార్పోరేషన్) వారి ఉర్దూ విభాగంలో తన తొలి రచనను ప్రచురించింది. భద్రతా కారణాల వాళ్ళ మారుపేరుతో వచ్చింది ఆ వ్యాసం. ఈ క్రమంలో తమ జీవితాలని, అమ్మాయిలుగా తమపై ఉన్న ఆంక్షల గురించీ చెబుతూ రాసిన ఆ వ్యాసాలు చాలా పేరు తెచ్చి పెట్టాయి మలాలా కు. 2009 లో తాలిబాన్లు ఆడపిల్లలు స్కూళ్ళకి వెళ్ళకూడదు అని ఒక రూల్ వేశారట. అంతే కాక, చాలా అమ్మాయిల స్కూళ్ళను నాశనం చేసేశారట కూడా. ఈ

సమయంలో, మలాలా వాళ్ళ స్కూల్లో వాళ్ళంతా తెలివిగా, తాలిబాన్లకి అనుమానం రాకూడదని యూనిఫారాలు వేసుకోకుండా మామూలు బట్టలేసుకుని వెళ్ళేవాళ్ళంట. దానితో అక్కడ స్కూల్ ఉన్నట్లు కాక, ఏదో పిల్లలున్న ఇల్లు ఉన్నట్లుగా కనిపించేదట! ఇలాగ కొనసాగుతూ ఉండగా మధ్యలో ఎలాగో ఒకలా పరీక్షలయితే రాయగలిగారు కానీ, అమ్మాయిల మీద ఆంక్షలు కొనసాగుతూ వచ్చాయి. ఈ దశలో, తన తండ్రి స్ఫూర్తితో, రాజకీయ నాయకురాలు కావాలని నిర్ణయం తీసుకుంది మలాలా, డాక్టర్ కావాలన్న కోరికను పక్కన పెట్టి.

2009 చివరి నుండి క్రమంగా మలాలా పేరు అందరికీ తెలియడం, ఆమె కూడా తాలిబాన్లకి వ్యతిరేకంగా బహిరంగ ప్రసంగాలు ఇవ్వడం మొదలైంది. స్వాత్ జిల్లా పిల్లల అసెంబ్లీ కి నేతృత్వం వహించి రెండేళ్ళు ఆ పదవిలో కొనసాగింది.

ఈ మధ్య కాలంలో అమ్మాయిల చదువు గురించి దాని అవసరం గురించి కూడా ప్రచారం చేసింది. 2011 లో అంతర్జాతీయ పిల్లల శాంతి బహుమతి కి నామినేషన్ అందుకుంది. ఆపై కొన్ని రోజుల్లోనే పాకిస్తాన్ ప్రభుత్వం ఇచ్చే జాతీయ యువత శాంతి బహుమతి అందుకుంది. మలాలా కృషి కి గుర్తుగా, స్వాత్ ప్రాంతాల్లోని ఒక అమ్మాయిల స్కూలుకి ఆమె పేరు కూడా పెట్టారు. అయితే, ఇలా పేరు తెచ్చుకునే కొద్దీ, తాలిబాన్లు, వారి సపోర్టర్ల నుండి మలాలాకు వార్నింగులు రావడం మొదలైంది. అయినా కూడా, మలాలా తన కార్యక్రమాలు ఆపకపోవడంతో, చివరికి కొన్ని రోజుల క్రితమే, తాలిబాన్ల గన్ మాన్ ఒకడు మలాలా ని బహిరంగ ప్రదేశంలో తుపాకీతో కాల్చాడు. తీవ్రమైన గాయాల మధ్య, అనేక ఆసుపత్రులు, సర్జరీలు అయ్యాక ఇప్పుడు క్రమంగా మళ్ళీ ఆరోగ్యవంతురాలు అవుతోంది. ప్రపంచవ్యాప్తంగా మలాలాకి సపోర్టుగా ప్రముఖులు ఎందరో ముందుకొచ్చారు. మలాలా పై జరిగిన దాడిని ఖండించారు. మలాలా ధైర్యానికి మెచ్చి పాకిస్తాన్ ప్రభుత్వం సితారా-ఎ-షుజాత్ అన్న ప్రభుత్వ బ్రేవరీ అవార్డు కూడా ప్రకటించింది.

ఇన్ని వ్యతిరేక పరిస్థితుల మధ్య కూడా అధైర్యపడకుండా, తాలిబాన్లని ఎదిరిస్తూ మలాలా ముందుకు సాగుతున్న తీరు స్ఫూర్తివంతంగా లేదూ?

*-సౌమ్య, పుస్తకం డాట్ నెట్*

# డయాబెటిస్- చక్కెర వ్యాధి

విజ్ఞానం

*రచన: డా. సమతపోటు, ఆయుర్వేదవైద్య, చెన్నేకొత్తపల్లి.*




మన కడుపులో అన్నాశయానికి వెనుకగా, దానికీ-వెన్నెముకకీ మధ్యన ఇరుక్కొని- ఉంటుంది, పలచగా ఉండే 'క్లోమ గ్రంధి'. ఈ గ్రంధిలోంచి విడుదల అయ్యే రసం మనం తిన్న ఆహారంలో కలిసి, ఆ ఆహారం శక్తిగా మార్పుచెందేందుకు దోహదం చేస్తుంది.




ఈ క్లోమగ్రంధి (పాంక్రియాస్) సరిగ్గా పనిచెయ్యకపోతే, అవసరమైనంత క్లోమరసం తయారు కాదు. అప్పుడు మనం తినే ఆహారంలోని పిండి పదార్థం అంతా చక్కెరగా మారి రక్తంలో కలవనైతే కలుస్తుంటుంది; కానీ ఆ చక్కెర తిరిగి 'శక్తి'గా రూపాంతరం చెందదు! అంటే ఎంత తిన్నా మనకు శక్తి రాదన్న మాట; ఎన్ని గ్లూకోజులు తీసుకున్నా నీరసంగానే ఉంటుందన్నమాట!

అంతేకాదు- దీని వల్ల మరో రెండు సమస్యలు కూడా ఎదురవుతాయి: రక్తంలో పెరిగిన చక్కెరను తగ్గించేందుకు, మన మూత్రపిండాలు చాలా ఎక్కువ పనిచేయాల్సి వస్తుంది. అవి అలసిపోతే ఎలాగ? ఇక రెండవది, రక్తంలో తీపిశాతం పెరిగినప్పుడు, అట్లా తీపిని ఇష్టపడే రకరకాల సూక్ష్మజీవులు మన శరీరంలోనే పెరగటం మొదలు పెడతాయి. రాను రాను అవి అనేక రోగాలను తెప్పిస్తాయి!

'క్లోమగ్రంధి సరిగా పనిచెయ్యకపోవటం' అనే ఈ సమస్యని వైద్యులు 'డయాబెటిస్- చక్కెర వ్యాధి'

అని పిలుస్తారు.

క్లోమ గ్రంథిని తిరిగి పనిచేసేట్లు చెయ్యటం ఆధునిక వైద్యులకు పెద్ద సవాలు అయి కూర్చున్నది. రాను రాను ప్రపంచంలో ఇంకా ఇంకా ఎక్కువమందిలో ఈ సమస్య కనబడుతున్నది. ప్రాచీన వైద్య విధానమైన ఆయుర్వేదంలో దీనికి తగిన మందులు ఉన్నప్పటికీ అవి ఏమంత మందికి అందుబాటులోకి రావటంలేదు.

మారిపోతున్న జీవనశైలి, అసహజ వాతావరణం చక్కెర వ్యాధిని ప్రేరేపిస్తున్నాయి. సమతులమైన ఆహారం, తగినంత శరీరశ్రమ, సంతోషంతో కూడిన పరిశుభ్రమైన జీవనం మన ఆరోగ్యానికి మూలస్తంభాలు. 

నవ్వండి!

**తెలివి మరీ ఎక్కువైంది!**

జాన్: నాన్నా, ఇతరులకు సహాయం చేయడానికీ మనం ఇక్కడ ఉన్నామని ఫాదర్ మాథ్యూ చెప్పారు ఇవాళ్ల.

నాన్న: అవును- నిజంగా మనం అందుకోసమే ఉన్నాం జాన్.

జాన్: మరి ఇతరులు అందరూ ఇక్కడ ఎందుకున్నట్లో ?

**ఆకళింపు ఎక్కువ!**

టీచర్: నా కుడి చేతిలో ఏడు ఆపిల్ పళ్ళు, ఎడమ చేతిలో ఎనిమిది ఆపిల్ పళ్ళు ఉన్నాయనుకో.. నీకు ఏమనిపిస్తుంది?

రోషన్: మీకు పెద్ద చేతులు ఉన్నాయనిపిస్తుంది టీచర్.

# సమీక్ష

*కొత్తపల్లి కథల పుస్తకం-55 పై ఒక సమీక్ష. నిర్వహణ: శ్రీమాలతీకృష్ణ, విజయవాడ.*




పిల్లల కథలూ, పెద్దల కథలూ అంటూ రెండు వర్గాలున్నాయి కనుక ప్రతి సారీ మొత్తం మీద ఎవరి కథలు 'బాగా చదివించేలా వున్నాయా' అని వెతకటం అలవాటయింది. సాధారణంగా రెండూ సమంగానో, లేదా 'పిల్లలవే బాగున్నాయిలే ఎలా ఐనా' అనిపించేలానో వుంటాయి. ఈ సారి మాత్రం 'పెద్దల కథలే ఓ పిసరు మెరుగ్గా వున్నయేమో' అనిపించింది. పిల్లలు వ్రాసిన కథలలో అంశాలు పెద్ద క్రొత్తగా అనిపించక పోవడం వల్లనో, క్రొత్త అంశాలైనా పకడ్బందీగా లేకపోవడం వల్లనో అవి 'ఫరవాలేదు' అనేలానే వున్నాయనిపించింది.

హైమవతి గారి 'దేవునికి కానుక'లో విషయం, శైలీ హుందాగా వున్నాయి. బొమ్మలు గీసిన చిత్రకారుడి పేరు తెలుసుకుందామని ఎంత వెతికినా చిక్కలేదు. 'ఎంతో పరిణతి గల, చేయి తిరిగిన చిత్రకారుడు ' అనిపించింది.

'న్యాయమూర్తి ఎంపిక' లాంటి ఇతి వృత్తిలతో చాలా కథలు చదువుతుంటాం. ఎక్కడా కూడా 'ఇది మరో కథలాంటిది' అనిపించకుండా క్రొత్త అంశం తీసుకుని రామకృష్ణ గారు వ్రాసిన తీరు బాగుంది. ఆయన ఈ కథ ద్వారా మనదృష్టికి తీసుకు వచ్చిన విషయం విలువైనది.

రాధ గారి 'ఎవరి కోసం?' సర్వసాధారణంగా కనిపించే విషయం. పిల్లల చదువుల విషయంలోనే కాదు - పెద్దలు చేసే అన్ని పనులకీ ఇది అంతేలా వర్తిస్తుంది. మంచి విషయం ప్రస్తావించారు.

నారాయణ గారి 'కోడి పెంపకం' భలే చమత్కారంగా, ఒక్క పిసరు వ్యంగ్యంతో కూడుకుని

సరదాగా వుంది. చిన్నపిల్లలకి ఈ కథని చదివి వినిపిస్తే బాగా నవ్వుకున్నారు. కాకపోతే చిన్నకోడి లాగానే వాళ్ళకీ అమ్మకోడి వేసిన వ్యంగ్య బాణాలు అర్థంకాలేదు.

బౌద్ధకథలలో అతి సాధారణమైన అంశం ద్వారా సున్నితమైన సందేశాన్నిచ్చే తీరు బాగుంది.

కెంట్ మెల్విల్ లాంటి చిన్నపిల్లాడెవడైనా సరే అతను చేసిన పని చేయడం గొప్పే, ఇక మెల్విల్ లాంటి వాడైతే చెప్పాలా?!

మంచిపుస్తకం సమాచారం బాగుంది.

ఇకపోతే 'ఎటువంటి భావాలనయినా అలవోకగా పలికించి, కళ్ళని కట్టి పడేసే వీరాంజి కుంచె, ఈ సారి కాకరపువ్వుత్తులలోని కాంతులని గానీ, చిన్నారుల కళ్ళల్లో వెలుగుని కానీ సరిగా చూపించలేదెందుకు?' అనిపించింది. కొత్తపల్లి పత్రిక అట్టమీది బొమ్మ కోసం ఆసక్తిగా ఎదురు చూసే వాళ్ళ గుంపులో నేనూ వున్నాను!

పిల్లలకీ, క్రొత్తపల్లి బృందానికీ క్రిస్మస్ శుభాకాంక్షలు!

నవ్వు!

**చెప్పింది చెప్పకుండా చెప్పద్దు!**

రక్షిత: ఆమెకు చెప్పవద్దని నేను నీకు చెప్పిన రహస్యాన్ని తనకు చెప్పావని ఆమె చెప్పింది.

వందన: హు! ఆమెకు నేను చెప్పిన విషయాన్ని నీకు చెప్పవద్దని నేను ఆమెకు చెప్పాను.

రక్షిత: ఆమె నాకు చెప్పేసిందని నేను నీకు చెప్పిన విషయం ఆమెకు చెప్పద్దు- సరేనా?

**మేం మాత్రం అలా చెయ్యం!**

గిరీష్: ఆ చిన్న పతకం నీకు ఎందుకిచ్చారు?

హరీష్: పాట పాడినందుకు.

గిరీష్: మరి ఆ పెద్దపతకం ఎందుకిచ్చినట్టో?

హరీష్: నేను పాటలు పాడటం ఆపివేసినందుకు.

# పదరంగం-22

*ఈ పదరంగం చాలా సులభం! దీన్ని ఓ పోస్టు కార్డులో పూరించి పంపండి. మీ పేరుతో బాటు మీ బడి పేరు, తరగతి తప్పక రాయండి. సరైన సమాధానాలు పంపిన పిల్లల పేర్లను పదరంగం-23 తో పాటు ప్రచురించగలం. నిర్వహణ: కొత్తపల్లి.*

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | ■ | 4 |
| | ■ | 5 | | 6 | |
| 7 | 8 | ■ | ■ | | |
| 9 | | 10 | ■ | | ■ |
| | ■ | 11 | | ■ | 12 |
| ■ | 13 | | ■ | 14 | |

**అడ్డం:**

1. తాళం కప్పు తెరవటానికి ఉపయోగించేది (4)
5. గజిబిజిగా 'కనువిప్పు' (4)
7. గోవు (2)
9. క్షేమం లాంటిదే - 'సాలాకు' ని సరిచేస్తే వస్తుంది (3)
11. తిరగబడిన పొట్టి సహాయం (2)
13. ఆకు (2)
14. ఇది లేనిదే పొగ రాదని సామెత (2)

**ఆధారాలు**

**నిలువు:**

1. ఈ ఆకులతో విసనకర్రలు చేస్తారు (5)
2. పాదరక్ష (2)
3. కవిత్రం చెప్పేవాడు తలక్రిందులయ్యాడు (2)
4. నీళ్ళను మరగబెడితే వచ్చేది (3)
6. ఫాలభాగం ముఖంలో కనుబొమల పైనుండేది (3)
8. సన్నం కానిది - తిరగబడింది (2)
10. యంత్రం కాని యంత్రం (3)
12. ఋణం (2)

పదరంగం 21కు సరైన జవాబు →

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 రా | మా | య | 2 ణం | ■ | 3 తో |
| బం | ■ | ■ | 4 బా | 5 లి | క |
| 6 దు | 7 రా | 8 శ | ■ | క | ■ |
| ■ | 9 వి | ని | ■ | 10 వా | 11 ప |
| 12 కం | చె | ■ | 13 ర | ■ | రు |
| 14 ప | ట్టు | ■ | 15 తె | లు | గు |

రాసిన వాళ్ళు:

1. జి.సత్యలక్ష్మి, 2వతరగతి, ఇంటిబడి, చెన్నేకొత్తపల్లి.
2. జి. వైష్ణవి, 7వతరగతి, కేశవరెడ్డి కాన్సెప్ట్ స్కూల్, అనంతపురం.

# చిలిపిప్రశ్నలు -తిక్కజవాబులు

*సేకరణ: శ్రీ వి.వి.యస్.మూర్తి, చొదిమెళ్ళ, పశ్చిమగోదావరి జిల్లా.*

1. ఆర్.టీ.సీ. డ్రయివర్ అదిరిపడేదెప్పుడు?

జవాబు: "నాకోసారి బస్సు నడపాలని వుంది" అని భార్య అన్నప్పుడు !!

2. సైకియాట్రిస్టు సందిగ్ధంలో పడేదెప్పుడు?

జవాబు: "కలలో అలారంమోగి మెలకువ వచ్చేస్తుంది" అని పేషెంటు అన్నప్పుడు!!

3. వినాయకుడు భూలోక విహారం చేస్తే........?

జవాబు: తన వాహనాన్ని "మౌస్" అని పిలుస్తాడు!!

4. పని చెయ్యని వాళ్లకు ఇచ్చేదేమిటి?

జవాబు: "పని"ష్మెంట్!!

5."సోమరి" దేనికి ఉపయోగపడ్తాడు?

జవాబు: సినిమా టైటిల్‌గా!!

6. లగేజ్‌కి లిమిట్ లేనిదెక్కడ?

జవాబు: స్కూలు బాక్స్‌లో

7. అరణ్య రోదనం అంటే...?

జవాబు: 'మమ్మల్ని నరికేస్తున్నారో' అని చెట్లు మొరపెట్టుకున్నా ఎవ్వరూ పట్టించుకోకపోవటం

**ముద్రిత ప్రతుల వెల:** ప్రతి ఒక్కింటికి: 20 రూ.
12 పుస్తకాలకైచందా: రూ. **250/-**

"కొత్తపల్లి ట్రస్టు" పేరిట యంవో/డిడిని ఈ చిరునామాకు పంపండి: కొత్తపల్లి ట్రస్టు, యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా- 515101, ఆంధ్రప్రదేశ్.
బ్యాంకు అక్కౌంటు వివరాలు:
"Kottapalli Trust", A/c No. 0138101018809 (savings), Canara Bank, Chennekothapalli. IFSC: CNRB0000138

ఫోన్లు: 08559 240222, 7702877670
ఇ-మెయిలు: team@kottapalli.in

**ఈ నెలలో ఏపని-ఎవరిది?**
ఆర్థిక వ్యవహారాలు, నిర్వహణ: సుబ్బరాజు
సంపాదకత్వం: నారాయణ
వెబ్సైటు, సాంకేతికత: ఆనంద్, లక్ష్మి
ముద్రణ: 'ముద్రిక' కృపాకరరావు
ముఖచిత్రం 'దీపావళి': వీరాంజనేయులు
చిత్రాలు: అడవి, ప్రసాద్, చంద్రకాంత్, గోపాల్, సురేష్, వినయ్, లక్ష్మివెంకట్, అంజి, శ్రీధర్, రామ్.
కథలు, పాటలు: చాలామంది పిల్లలు

**ప్రత్యేక కృతజ్ఞతలు:** రిషివ్యాలీ రూరల్ స్కూలు వారికి, అరవిందాహైస్కూల్ వారికి, ప్రభుత్వ ప్రాథమికోన్నత పాఠశాల బద్దలాపురం వారికి, మ్యాజిక్ కథల శంకర శివరావు గారికి, 'విద్యార్థి' మాలతీకృష్ణగార్లకి, కార్టూనిస్టు ఏవియం గారికి, రాధా రాజశేఖర్ గార్లకి, కంప్యూటర్లలో లైనక్సు వ్యవస్థను చక్కగా అందిస్తున్న ఉబుంటు వారికి, జింప్, అడాసిటీ తదితర ఓపెన్ సోర్సు సాఫ్టువేరు నిర్మాతలకు, ఇంకా పేర్లు రాయని అనేకమందికి.

పిల్లల్లో సృజనాత్మకత సహజం. కథలు, ఆటలు, పాటలు, బొమ్మలు దానికి ఊతాన్నిస్తాయి. మాతృభాషలో ఇష్టంగా చదవటం, తేలికగా రాయటం వస్తే అటుపైన అన్ని శాస్త్రాలూ సులభంగా వంటపట్టుతాయి-నిజం! అందుకని మీ పిల్లల్లో ఉన్న కాల్పనిక శక్తికి పదును పెట్టండి. వాళ్లను కథలు రాసేందుకు, పాటలు పాడేందుకు, బొమ్మలు వేసేందుకు ప్రోత్సహించండి. వాళ్ళ రచనల్ని మాకు పంపండి. కావాలనిపిస్తే మీరే ఇలాంటి పత్రికనొకదాన్ని మొదలు పెట్టండి- ఎలాగైనా సరే- పిల్లలు పెద్దవాళ్లయ్యేలోగా వాళ్ళు చాలా చాలా తెలుగు కథల్ని చదివేలా, రాసేలా చేయండి. మీ పిల్లలకు ఈ పత్రికలోని కథలు నచ్చుతాయనే మా నమ్మకం- వీటిని వీలైనంత మందితో పంచుకోండి. మీరు రాసిన పిల్లల కథలు ఏమైనా ఉంటే పనిగట్టుకునైనా సరే, మాకు పంపండి. వీలు చేసుకొని ప్రచురిస్తాం.

మంచి పుస్తకం:

బచ్ పన్ యాది

చిన్నప్పటి ముచ్చట గుర్తున్నదా?

"బాయి బాయి తిరుగుకుంటు

తొంగి తొంగి చూసేది

పిట్ట గూళ్లు తీసుకొచ్చి

ఇంటి ముందు కట్టేది?"

గుర్తుండే ఉంటాది. మరియీ ముచ్చట?

"ఇంటికి సుట్టమొస్తే

ఇజ్జతెంతో ఇచ్చేది

కాళ్లు కడుక్కోమంటు

నీళ్ల చెంబు ఇచ్చేది?"

తప్పకుండా గుర్తుండి ఉంటుంది-

ఇది కూడా-

"చిమ్మ చీకట్లోన

మిరప పురుగులను పట్టి

జేబులోన ఏసుకొని

లైటు అంటు మురిసేది?"

మరచి పోనీకుండా గుర్తుండిపోయే ఇలాంటి ఎన్నో ముచ్చట్లు, ముచ్చటగా పదహారు పేజీల్లోకి తెచ్చిపెట్టారు రాంచందర్ భీం వంశీ. జహీరాబాద్ ప్రాంతపు మాండలీకంతో తెలంగాణ ఊళ్లలో బాల్యానికి అద్భుతమైన రంగులద్దారు. చాలా చక్కని చిన్ని పుస్తకం!




"బచ్ పన్ యాది"

రాంచందర్ భీంవంశీ.

జనవిజ్ఞాన వేదిక, జహీరాబాదు యూనిట్-

ప్రగతి నర్సింగ్ హోంల సంయుక్త ప్రచురణ.

రచయిత: 9951619119

వెల: అప్రచురితం పేజీలు: 16



## అయ్యో ! తెలుగు రాదే, ఎలాగ?!

"కథలమ్మా కథలు! కథలమ్మా కథలు! రకరకాల కథలు! తెలుగుపిల్లల కథలు!"

"ఏం కథలు బాబూ? మా పిల్లలకు తెలుగు చదవటం రాదు. ఇంగ్లీషు కథలు ఏమన్నా ఉన్నాయా, నీ దగ్గర?"

"ఇంగ్లీషువైతే వేరేవాళ్ళ దగ్గర దొరుకుతాయండి. నా దగ్గర ఉన్న సరుకంతా తెలుగువాళ్లకోసమే. ఏం, మీ పిల్లలు తెలుగువాళ్ళు కారాండీ? పాపం, వాళ్ళకి కొంచెం తెలుగు నేర్పించకపోయారూ?"

"ఏమో నాయనా! మా వాళ్లకైతే ఇంగ్లీషు అంటేనే ఇష్టం. ఆ ఇంగ్లీషు నేర్చుకునేసరికే వాళ్ల తల ప్రాణం తోకకొచ్చింది. ఇంక తెలుగు ఎక్కడ నేర్చుకుంటారు?"

"అవున్లెండి, పాపం. కానీ నా దగ్గర ఉన్నవి తెలుగు కథలేనండి. మీకు పనికిరావు."

"ఏదీ, ఓసారి చూడనియ్యి- పుస్తకం బానే ఉన్నట్టుందయ్యా, కాయితం, రంగులు అదీనీ- దీన్ని పాపం ఇంగ్లీషులో అచ్చెయ్యకపోయారూ? మీకూ కొంచెం అమ్మకాలుండేవి గద! ఇప్పుడు పిల్లలంతా ఇంగ్లీషు బళ్లలో చదివీ చదివీ, తెలుగుని పూర్తిగా మరచేపోతున్నారుగా?"

"అవునండీ, అందుకనే వీటిని తెలుగులో మాత్రమే అచ్చేస్తున్నాం. మీ పిల్లలకి ఈ కథలు కావాలంటే వాళ్ళు తెలుగు నేర్చుకోవాల్సిందే, తప్పదు. లేకపోతే ఇంకో మార్గం ఉంది- మీరు వాళ్లకి చదివి పెట్టచ్చు-"

"అవున్లే, అట్లాగైనా వాళ్లకి మెల్లగా తెలుగు చదవటం వస్తుందేమో, చూస్తాను. కథలు చదవటం కోసమన్నా వాళ్ళు తెలుగు నేర్చుకుంటారేమో"

"తప్పకుండా నేర్చుకుంటారు చూడండి. అదేమంత బ్రహ్మవిద్య? తలచుకుంటే వాళ్ళు ఒక్కరోజులో నేర్చుకోగలరు. కథల్లో మాయ మీకు తెలీనిదా? మీరు చిన్నప్పుడు ఎన్ని కథల పుస్తకాలు చదవలేదు?"

"అవును నాయనా! ఇప్పుడు తెలుగు పుస్తకాలే కరువైపోతున్నాయి"

"ఏమీ లేదండీ! ఆదరించేవాళ్లు ఉంటే భాష చటుక్కున పుంజుకుంటుంది. ఏం చేసినా తెలుగులో అర్థమైనంత బాగా పరాయి భాషలో ఎంతమందికి అర్థమౌతుంది, చెప్పండి? ఏదో ఒక మాయ చెయ్యాల్సిందేనండీ. మీ పిల్లలకి 'తెలుగు రాదు' అని ఊరుకోకండి. ఏదో ఒకటి చేసి వాళ్ళ భాషని వాళ్ళకి ఇవ్వాలి- లేకపోతే కుదరదు."

"అంతేనంటావా?"

"అంతేనండీ- వేరే మార్గం లేదు. మాతృభాష తర్వాతే, వేరే ఏదైనా."

Published by Narayana for Kottapalli Trust, Near M.R.O.Office, Chennekothapalli-515101, Ananthapur District, AP. Ph:08559240222 E-mail: team@kottapalli.in and printed at Mudrica Offcet Printers, Vijayawada,Phone:08662579129